# విస్‌డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాస పత్రిక




చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000 00 |
| జీవిత చందా | 200 00 |
| 3 సంవత్సరాలకు | 33 00 |
| సంవత్సర చందా | 12 00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 75.00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 40.00 |


చందాలు పంపవలసిన చిరునామా

విస్‌డమ్ పబ్లికేషన్స్,
9. దేశికా రోడ్డు. మైలాపూరు.
మద్రాసు 600 004


## ఈ సంచికలో

ఏప్రిల్ 1983



★

ముఖచిత్రం - కలర్ ట్రాన్స్‌పరెన్సీ:
మంజుల, ఘజియాబాద్. (ఉ. ప్ర.)

★

తెలుగు 'విస్‌డమ్' కు ఇది రెండో సంవత్సరం

## ధ్యానం

### ఆత్మ సమర్పణం



జేమ్స్ ఎలెన్

'ఆత్మ సమర్పణం' అంటే కేవలం బాహ్యమైన ప్రాపంచిక సంపదలను వదులుకోడం కాదు. మనస్సు లోపల ఉన్న పాప చింతనను వదులుకోడమే నిజమైన ఆత్మ సమర్పణం. ఖరీదైన దుస్తులు ధరించడం మాని అహార నియమం పాటిస్తూ, మృదువుగా మాట్లాడుతూ ఉన్నంత మాత్రాన 'సత్యం' మనకు సాక్షాత్కరించదు. అహంకారం, దర్పం, ధనాశ, భోగ లాలస, ద్వేషం, స్వార్థపరత్వం అంత రించి, హృదయం నిర్మల మైనప్పుడే 'సత్యం' అవగతం అవుతుంది. ●

## సంపాదకుని పేజీ

### జీవితంలో విజయానికి ఆత్మ విశ్వాసం ప్రధానం!



జీవితంలో లేదా జీవితంలోని ఒకానొక రంగంలో విజయం సాధించా లంటే స్త్రీకి గాని, పురుషునికి గాని ఆత్మ విశ్వాసం ముఖ్యం. చెయ్యవలసి ఉన్న పనిని అవలీలగా చెయ్యగల ననే నమ్మకమే 'ఆత్మ విశ్వాసం'. ఆత్మ విశ్వాసం లోపించిన వారిలో 'ఆత్మ

### పొగాకు ఉత్పత్తిలో 3 వ స్థానంలో ఇండియా

అమెరికా, చైనాల తరువాత ప్రపంచంలో పొగాకు ఎక్కువగా ఉత్పత్తి చేసే దేశం ఇండియాయే। పొగాకు ఎగుమతుల వలన ఇండియా ఏటా దాదాపు రూ. 45 కోట్ల విలువ గల విదేశీ మారక ద్రవ్యం సంపా దిస్తూంది.

"అన్యాయపు మార్గాల ద్వారా సొమ్ము సంపాదిస్తే దాని ఫలితం అనుభవించక తప్పదు." —కొరాన్

న్యూనతా భావన' (inferiority complex) కనిపిస్తుంది. అది వారిలో సిగ్గునీ, ఒంటరి తనాన్నీ, ఉక్రోషాన్నీ, భయాన్నీ ఎక్కువ చేస్తుంది.

దీక్షతో నిరంతరం కృషి చేస్తే ఏ వ్యక్తి అయినా ఆత్మ విశ్వాసం సాధించవచ్చు. కేవలం తమ ఆత్మ విశ్వాసం వల్లా, ధైర్యం వల్లా, పట్టుదల వల్లా ప్రపంచ చరిత్రలో ఎందరో స్త్రీలూ, పురుషులూ మహోన్నత స్థానాలు అందుకున్నా రని మరచిపోకూడదు. అంటువ్యాధి లాంటి వారి ఉత్సాహం, బహు ముఖ మైన వారి పరిజ్ఞానం, వారి నిరంతర కృషి వారిలో ఆ ఆత్మ విశ్వాసాన్ని కలిగిం చాయి. వారిలో ప్రతి ఒక్కరూ శాశ్వతమైన కీర్తిని గాని, సాటిలేని సంపదను గాని, లేదా రెండింటినీ గాని సాధించిన వారే!

ఆత్మ విశ్వాసం వల్లనే 'మార్కొనీ' ఘన విజయాలు సాధించాడు. నిస్తంత్రీ తరంగాల (wirel‹s waves) సాయంతో అతి శీఘ్రంగా వార్తలు పంపే సాధనాలు కనిపెట్టి అతడు ప్రపంచాన్ని సంభ్ర మాశ్చర్యాలలో ముంచెత్తాడు. గుజరాత్‌లో ఒక సామాన్య వైశ్య కుటుంబంలో జన్మించిన గాంధీజీ ఇత రుల సౌఖ్యం పట్ల శ్రద్ధ ప్రదర్శించి, తద్వారా ఆత్మవిశ్వాసం సాధించి, కోట్లకొలది భార తీయులకు మకుటం లేని మహారాజు అయాడు.

ఆత్మ విశ్వాసం లోపిస్తే నైరాశ్యం, నిస్పృహా కలుగుతాయి. జీవితంలో పైకి రావా లంటే ఆత్మ విశ్వాసం పెంపొందించు కోవాలి. మొట్టమొదటి అంశం - ఇతరుల కంటె మనం తక్కువ అని ఎందుకు అను కుంటున్నామో తేల్చుకోవాలి. మనో విశ్లేషణ (self analysis) ద్వారా ఈ తక్కువతనపు భావనకు కారణం మనం గుర్తించవచ్చు. చిన్నతనంలోనే ఈ భావం మనస్సులో దృఢంగా పాతుకుపోవడానికి కారణమైన సన్ని వేశాలను అన్వేషించాలి. మనల్ని ఎవరూ పట్టించుకోక పోవడం, తోటి మిత్రులు అన్ని విషయాలలోనూ మనకంటె పై చేయిగా ఉండడం, నిత్యం విమర్శలకు గురి అవుతూ ఉండడం, సాంఘిక వివక్షణలు అనుభవించ

## మిక్కిలి పెద్ద లారీ



ప్రపంచంలో సరుకు రవాణా చేసే మిక్కిలి పెద్ద లారీని ప. జర్మనీలోని బాడెన్ వుర్టెంబర్గ్ నగరంలో 'షుయెర్లె' సంస్థ వారు రూపొందించారు. సరుకు నింపడానికి 500 చ.మీ. ల స్థలం ఉన్న ఈ రాకాసి లారీ 2,000 టన్నుల బరువును రవాణా చేయ గలదు.

"సంతోషాన్ని దాచుకోగల వ్యక్తి
బాధలను దాచుకోగల వాడి కన్న గొప్పవాడు!" —లావెటర్

వలసి రావడం - వీటిలో ఏ ఒక్కటైనా పసి మనస్సులలో 'మనం తక్కువ వాళ్ళం' అనే బలమైన భావాన్ని ప్రవేశ పెట్టగలవు. ఆ భావానికి మూలకారణం ఏదో గుర్తిస్తే ఆ భావం నుంచి బయట పడవచ్చు.

ఏదో ఒక భ్రాంతికి లోనై 'నేను తక్కువ వాణ్ణి' అనుకుంటూ ఉండడం కేవలం అవివేకం. తక్కువతనపు భావన కేవలం భ్రాంతి వల్ల కలిగేదే! ఇతరు లెప్పుడూ మనలోని లోపాలనే గమనిస్తూఉంటా రని ఊహించుకో కూడదు. నిజానికి ఒకడు తక్కువ, మరొకడు ఎక్కువ అనే మాట కర్థం లేదు. ఏదో ఒక అంశంలో ఒకడు మరొకని కంటె తక్కువ అయి ఉండవచ్చు; మరో అంశంలో అధికుడూ అయి ఉండవచ్చు. ప్రతి వానిలోనూ ఎవరి లోపాలు వారికి ఉంటాయి అనే సత్యాన్ని గ్రహిస్తే మన 'తక్కువ తనపు భావన' క్షణంలో మటుమాయ మవుతుంది.

దీక్షతో, ఆసక్తితో పని చేస్తూ ఉంటే మరో ఆలోచనకు తావే ఉండదు. మన ఉత్సాహంలోనూ, విజ్ఞానంలోనూ మన ఆత్మవిశ్వాసం ప్రస్ఫుటం అవుతుంది. చేపట్టిన పనిని హృదయపూర్వకంగా చెయ్యాలి. కష్టపడి పనిచేసిన కొద్దీ మన ఆత్మ విశ్వాసం దృఢతరం అవుతూ వస్తుంది.

ఎవరిని వారే సంస్కరించుకోవాలి. ఇంకెవరో వచ్చి సంస్కరించ గలగడం కల్ల. అవసరమైన ఆత్మ విశ్వాసం లోపలి నుంచే రావాలి. ఈ సంగతి గుర్తించిన మరుక్షణం మనలో పూర్తి మార్పు వస్తుంది.

రోమ్ నగరం ఒక్క రోజులో నిర్మించబడలేదు. నిర్దిష్టమైన మార్గాన్ని అనుసరిస్తూ ఉంటే ఎప్పటికో ఒకప్పటికి గమ్యం చేరుకోడం ఖాయం! ●

## మిక్కిలి పెద్ద గొర్రెల కేంద్రం

ప్రపంచంలో మిక్కిలి పెద్ద గొర్రెల కేంద్రం ద. ఆస్ట్రేలియాలో వాయవ్య భాగాన ఉంది. 4,081 చ మైళ్ళ విస్తీర్ణం గల ఈ కేంద్రం 80 వేల గొర్రెలకూ, 700 పశువులకూ మాత్రమే కాక, పిలవని పేరంటంగా అక్కడ చేరుతూ ఉండే 25,000 'కంగారూ' జంతువులకు కూడా ఆశ్రయం ఇస్తోంది.

## బంగారపు ఉంగరా లంటే అమెరికన్‌ల మోజు



అమెరికాలోని 'గోల్డ్ ఇన్ఫర్మేషన్ సెంటర్' నిర్వహించిన సర్వే ప్రకారం ప్రతి ఏడూ అమెరికన్‌లు 100 కోట్ల డాలర్ల విలువ చేసే బంగారపు ఉంగరాలు కొంటున్నారు. ఎక్కువ మంది 14 కేరట్ల బంగారమే ఇష్టపడినా, 10 కేరట్ల, 18 కేరట్ల బంగారం కొనేవారు కూడా ఉన్నారు.

"కొత్తగా కలిగిన సుఖాలు కొత్త బాధలను తెస్తాయి." —బిల్వర్

# ఇల్లు-ఇల్లాలు

హెచ్. కె. లక్ష్మణరావు

ఆశించిన ఫలితాన్ని సాధించే కళను, లేదా నిపుణతను 'యాజమాన్య' కళ (management) అంటారు. మనుషులు, సామగ్రి, డబ్బు, భోగట్టా మొదలైన అందుబాటులో ఉన్న సాధన సంపత్తిని అత్యుత్తమమైన



విధంగా వాడుకోడానికి అవసరమైన జాగ్రత్తలన్నీ ఈ 'యాజ్యమాన్య' కళలో భాగాలే.

'యాజమాన్యం' అనే మాట వర్తమాన కాలంలోనే ఎక్కువగా ప్రచారంలోకి వచ్చినా చాలా ప్రాచీనమైంది ఈ నేర్పు.

వ్యాపారంలోనూ, ఇతర వృత్తి రంగాలలోనూ మాత్రమే 'యాజమాన్య' నైపుణ్యాలను ప్రదర్శించవలసిన అవసరం వస్తుందని సాధారణంగా అనుకుంటాం. సంసారం నిర్వహించడంలో కూడా ఈ 'యాజమాన్య' నైపుణ్యం అంతగానూ అవసరం అవుతుందని మనం ఎన్నడూ గుర్తించం.

వ్యాపార రంగంలో ఉత్పత్తి మేనేజరు, సిబ్బందీ మేనేజరు, కార్య నిర్వహణ (administration) మేనేజరు, నాణ్యత తగ్గకుండా చూసే మేనేజరు, ఆర్థిక విషయాల మేనేజరు, అకౌంట్ల మేనేజరు, ప్రజా సంబంధాల మేనేజరు అంటూ ఎందరో మేనేజర్లు కనిపిస్తారు.

సంసార నిర్వహణలో కూడా ఇన్ని రకాలైన మేనేజర్ల అవసరం లేదా?

---

## మిక్కిలి పొడవైన పురాణ కావ్యం

ప్రస్తుతం 78 ఏళ్ళ వయస్సు గల నిరక్షరాస్యుడైన 'జాబా' తన 9 వ ఏట ఒక బౌద్ధ లామా దగ్గిర 'గెసేయర్ రాజ చరిత్ర' అనే పురాణ కావ్యం నేర్చుకోడం మొదలు పెట్టాడు. తరువాతి తరాల వారి కోసం ఇప్పుడు ఆయన దానిని గ్రంథస్థం చేయిస్తున్నాడు. ప్రపంచంలో మిక్కిలి పొడవైన ఈ కావ్యంలోని 31 భాగాలలో ఇప్పటికి వ్రాసిన 16 భాగాలలోనే సుమారు ఒక కోటి మాటలు ఉన్నాయి.

"మనిషికి రెండు రకాల విపత్తులు: ఒకటి తనకు కలిగిన దురదృష్టం: రెండోది పక్కవాడికి పట్టిన అదృష్టం!" —లాబ్రుయరీ

ఉంటే - ఆ పను లన్నీ సంసార రంగంలో ఎలా నిర్వహించ బడుతూందీ పరిశీలిద్దాం। 'గృహ పాలన' రంగంలో ఈ హోదా లన్నీ ఒకే వ్యక్తిలో మనకు కనిపిస్తాయి. ఆ వ్యక్తి డెజిగ్నేషను 'ఇల్లాలు', 'గృహిణి'।

అందుబాటులో ఉన్న సాధన సంపత్తి తగ్గిన కొద్దీ 'యాజమాన్య' కౌశలం మరింత ఎక్కువగా అవసరం అవుతుంది.

సమర్థురాలైన గృహిణి ఇంచు మించు ఎదుగూ, బొదుగూ లేని నిర్ణీత మైన ఆదాయంతో కుటుంబంలోని వివిధ వ్యక్తుల అవసరా లన్నీ తీర్చవలసి ఉంటుంది. కొన్ని ఖర్చులు - అద్దె, వంట సామానులు, పిల్లల స్కూలు జీతాలు మొదలైనవి - తప్పని సరి ఖర్చులు. మరి కొన్ని - దీపావళి లాంటి పండగ ఖర్చులు, బంధువులు రావడం, పెళ్ళిళ్ళు, పేరంటాలూ లాంటివి - అడపా దడపా వచ్చే ఖర్చులు. ఇంకొన్ని - జబ్బు చెయ్యడం, ఏదైనా విపత్తు సంభవించడం లాంటివి - అనుకోకుండా వచ్చేవి. ఇల్లాలు కుటుంబపు ఆర్థిక వ్యవహారాలు చక్కబెట్టు కోవడంలో ఆమెకు ఎంతో దూరదృష్టి, నేర్పు అవసరం అవుతుంది. ఒకవంక దైనందిన కార్యక్రమం యథావిధిగా సాగేట్టు చూస్తూనే, మరోవంక దీర్ఘకాలిక, హ్రస్వకాలిక అవసరాలను కూడా ఆమె దృష్టిలో ఉంచుకోవాలి. అంటే సమర్థురాలైన ఇల్లాలు ఆర్థిక విషయాల మేనేజరుగా వ్యవహరిస్తుంది అన్న మాట।

ఫాక్టరీలలోని ఉత్పత్తి మేనేజరు ఎంత ముడిసరుకు కావాలో అంచనా వెయ్యడం, ఉన్న సాధన సంపత్తితోనే వీలైనంత ఎక్కువ ఉత్పత్తిని సాధించడం మొదలైన పనులు సమర్థంగా నిర్వహిస్తూ ఉంటాడు. దూర దృష్టితో ముందుగానే చౌకగా ముడి సరుకు కొని నిలువ చేస్తాడు. ఇదే విధంగా - గృహ రంగంలోనూ ఇల్లాలు తగిన జాగ్రత్తలు తీసుకుంటుంది. ఒక వంక బడ్జెట్ పరిమితులను దృష్టిలో ఉంచుకుంటూనే -

## ధ్యానం



జీవితంలో చాలా గొప్ప కళలలో 'ధ్యానం' ఒకటి.బహుశః ఇదే సర్వోత్కృష్ణమైన కళేమో కూడా। ఇది ఇతరుల నుంచి నేర్చుకొనేది కాదు - అదే దానిలో చమత్కారం। దానికి ఒక ప్రక్రియ గాని,ప్రమాణం గాని లేవు. నిన్ను గురించి నువ్వు తెలుసుకుంటూ, నీ నడత, నీ భోజనం, నీ మాటలు, నీ ద్వేషాలూ, నీ అసూయలూ అన్నీ గమనిస్తూ ఉండడం - అది కూడా ధ్యానంలో భాగమే।

— జె. కృష్ణమూర్తి

"అంధకారం తర్వాత వచ్చిన వెలుతురు వలె
దుఃఖాన్ని వెన్నంటి కలిగే సుఖం ఆనందాన్నిస్తుంది." -శూద్రక మహాకవి

కుటుంబ సభ్యులలో ఎవరి అభిరుచులకు అను కూలంగా వారికి ఆమె వండి పెడుతుంది. రోజూ ఒకే రకం వంట చేసి ప్రాణం విసుగు పుట్టించకుండా వీలైనంతలో కూరలు మార్చి మార్చి చేస్తూ ఉంటుంది. ఏ రోజు ఏం చెయ్యాలో, సెలవు రోజుల్లోనూ, పండగ రోజుల్లోనూ ఏయే పిండివంటలు చెయ్యాలో ముందుగానే ఆమె ప్లాన్ చేసు కుంటుంది. ఇవన్నీ దృష్టిలో పెట్టుకునే నెల సామాన్లు తెచ్చుకుంటుంది. ఫాక్టరీలోని ఉత్పత్తి మేనేజరు కంటె ఆమె బాధ్యతలు ఏ విధంగానూ తక్కువైనవి కావు. యాజ మాన్య కళలో సమయం చాలా విలువయింది. సమర్థురాలైన ఇల్లాలు తన కాలాన్ని ఎంతో పొదుపుగానూ, నేర్పుగానూ వాడుకుంటుంది. తన దైనందిన కార్యక్రమాన్ని ఆఫీసు లకూ, స్కూళ్ళకూ వెళ్ళవలసి ఉన్న కుటుంబ సభ్యు లందరి కార్యక్రమాలకూ అనుగుణంగా ఆమె ఏర్పాటు చేసుకుంటుంది.

సమర్థురాలైన గృహిణి సరుకులు కొనడం లోనూ, వంటకాలు తయారు చెయ్యడం లోనూ నాణ్యతను ప్రధానంగా చూస్తుంది. అవసరమైన సందర్భాలలో 'మచ్చు చూసే' (sampling) పద్ధతులు కూడా అవలంబి స్తుంది. ఆ విధంగా ఆమె నాణ్యత తగ్గకుండా చూసే మేనేజరు (quality control manager) పాత్రను కూడా నిర్వహిస్తుంది.

తన మానాన తను చేసుకుంటూ పోవ డమే కాదు: పిల్లలు, నౌకర్లు, ఒక్కొ క్కప్పుడు అత్తగారు లాంటి ముసలివాళ్ళు - వీ రందరిచేతా సక్రమంగా పని చేయించే బాధ్యత కూడా ఇల్లాలిదే: దీనికి ఎంతో నేర్పూ, ఓర్పూ అవసరం. కార్మికుడు, పర్యవేక్షకుడు - ఇద్దరి పాత్రలూ ఏక కాలంలో ఇల్లాలు ధరిస్తుంది.

ఇక - కాకలు తీరిన ఇల్లాలు 'ప్రజా సంబంధాలు' అద్భుతంగా నిర్వహిస్తుంది. పిల్లలు, నౌకర్లు, ఇరుగు పొరుగులు, స్నేహి తులు, కాలక్షేపం కోసం వచ్చి అపవాదులు ప్రచారం చేసే అమ్మ లక్కలు - ఎవరితో

---

## అతి ప్రాచీనమైన మొక్క



'పూయా రై మోండి' అనే అతి ప్రాచీన మైన ఒక మొక్క పెరూ దేశం (ద. అమె రికా) లోని కార్డిలెరా కొండలలో ఎక్కు వగా పెరుగుతుంది ఆ మొక్క నుంచి 33 అ.ల ఎత్తైన పూలగుచ్ఛం వెలువడుతుంది. ఆ గుచ్ఛం నుంచి నిరంతరం బంక వంటి తైల పదార్థం బయటికి వస్తుంది. అక్కడి పశువుల కాపర్లు దానిని వెలిగించి ఆ చుట్టు పట్ల అంతా కాంతి ప్రసరించేట్టు చేసు కుంటారు.

"మనిషికి పెట్టని కోట - చదివిన చదువు కాదు: సంపాదించిన వ్యక్తిత్వం!" —స్పెన్సర్

ఎలా వ్యవహరించాలో, ఎవరిని ఎంతలో ఉంచాలో ఆమెకు తెలుసు. ఆ విధంగా ఆమె సంసారానికి ప్రజా సంబంధాల మేనేజరు కూడాను.

కుటుంబానికి మంచి పేరు రావా లంటే ఎవరితో ఏ విధంగా మాట్లాడాలో ఇల్లాలికి తెలుసు. ఆ విధంగా కుటుంబానికి అడ్వర్టైజ్‌మెంట్ మేనేజరు కూడా ఇల్లాలే. అవసరమైనప్పుడు తన కొడుక్కో, కూతురికో పెళ్ళిళ్ళ మార్కెట్‌లో గిరాకీ ఏర్పడే ప్రయత్నాలు కూడా ఆమె చేస్తుంది. ఆ విధంగా 'అమ్మకాలు పెంపొందించే మేనేజరు' (sales promotion manger) పాత్రను కూడా ఆమె ధరిస్తుంది.

సమర్థుడైన మేనేజరు ముఖ్యంగా నమ్మకం మీదనే ఒక సంస్థను చక్కగా నడుపుతాడు. కొన్ని కొన్ని బాధ్యతలు కొందరికి వప్పగించి వాళ్ళ వాళ్ళ పాత్ర లేవిటో వాళ్ళకు స్పష్టంగా అర్థం అయ్యేట్టు చేస్తాడు. వాళ్ళు సాధించే ఘన కార్యాలకు వాళ్ళను మెచ్చుకుంటూ సామరస్య పూరితమైన వాతావరణాన్ని సంస్థలో కలిపిస్తాడు. కుటుంబ రంగంలోనూ సమర్థురాలైన ఇల్లాలు ఈ పను లన్నీ చేస్తుంది. ఈ బాధ్యత లన్నీ బయటి నుంచి ఎవరో తనమీద మోపడం వల్ల ఆమె నిర్వహించడం లేదు. 'ఆత్మప్రేరణ' (self-motivation) వల్లనే ఇన్ని బాధ్యతలూ ఆమె వహిస్తుంది. ●

## కొత్త మార్గాన ఎవరెస్టు శిఖరారోహణ

రష్యా నుంచి వచ్చిన 11 మంది పర్వతారోహకుల బృందం ఇంతకు ముందు ప్రయత్నించి ఉండని కొత్త మార్గాన ఇటీవల ఎవరెస్ట్ శిఖరం అధిరోహించారు. అందులోనూ నలుగురు రాత్రిపూట శిఖరం చేరుకోడం విశేషం!

## ఐఫెల్ టవరుకి మరమ్మతు



పారిస్ (ఫ్రాన్స్) లోని 93 ఏళ్ళ నాటి 'గ్రాండ్ ఓల్డ్ లేడీ' అనబడే 'ఐపెల్ టవరు' కి ఇటీవల మరమ్మతు జరిగింది. 1889 లో పారిస్‌లో జరిగిన వరల్డ్ ఫెయిర్ సందర్భంలో 'గుస్టేవ్ ఐపెల్' అనే ఇంజనీరు నిర్మించిన ఈ టవరు బరువు ఆదిలో కంటె ఇప్పుడు 10 శాతం తగ్గినట్టు తెలుస్తుంది.

"లోకంలో స్వచ్ఛమైన ప్రేమ అరుదైతే,
నిజమైన మైత్రి మరింత అరుదు!" -వాకాల్ట్

# జాతీయ వార్తలు

## ఆసియాలో మిక్కిలి పెద్ద థెర్మల్ కేంద్రం:

ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో మీర్జాపూర్ జిల్లాలోని 'ఓబ్రా' థెర్మల్ కేంద్రంలో ఆఖరిదైన అయిదవ జెనరేటర్ కూడా పని చెయ్యడం మొదలు పెట్టడంతో ఆ కేంద్రం ఇప్పుడు మొత్తం 1,750 మెగావాట్ల శక్తిని ఉత్పత్తి చేస్తూంది. ఆసియా అంతటిలో ఇదే మిక్కిలి పెద్ద థెర్మల్ కేంద్రం!

* * *

## రామగుండం ఎరువుల ఫ్యాక్టరీ:

ప్రజా రంగంలో పనిచేస్తున్న రామగుండం ఎరువుల ఫాక్టరీ 1981 లో రూ. 25 కోట్లు విలువ చేసే 1,25,000 మెట్రిక్ టన్నుల యూరియాను ఉత్పత్తి చేసింది. ప్రపంచంలో కల్లా పెద్దదైన, ఆసియాలో తొలిసారిగా అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగిస్తున్న ఈ ఫాక్టరీ రూ. 224 కోట్ల వ్యయంతో ప. జర్మనీ సహకారంతో నిర్మించబడింది.

* * *

## చిత్తూరు జిల్లాలో మరో రెండు బంగారు గనులు:

చిత్తూరు జిల్లాలోని 'చేగర గుంట-నంది మడుగు' ప్రాంతంలో 3.5 లక్షల టన్నులూ, 4 లక్షల టన్నులూ బంగారం ఖనిజం లభించే మరి రెండు ప్రాంతాలు గుర్తించబడ్డాయి. ఒక టన్ను ఖనిజం నుంచి 8 గ్రాముల బంగారం లభించగల దని తెలుస్తూంది.

## పూర్తి ఫిలిమ్‌ను రికార్డ్ చేసే 'లేసర్' కిరణం



ప. జర్మనీలోని 'సీమెన్స్' కంపెనీ తయారు చేసిన ఒక లేసర్ ట్యూబ్ నుంచి వెలువడే కిరణం సెకనుకి 25 సార్లు తిరుగుతున్న ఒక ప్లేటు (disc) ను తాకి రంగుల తోనూ, స్టీరియో ధ్వనులతోనూ కూడిన ఒక పూర్తి ఫిలిమ్‌ను రికార్డు చేయగలదు. ఆ ప్లేట్‌ని ఏ టెలివిజన్ సెట్‌లో అయినా ఉపయోగించుకోవచ్చును.

"మూర్ఖుల నుంచి ప్రశంసలు అందుకోడం కన్న బుద్ధిమంతులచేత తిట్లు తినడం మంచిది!" —షేక్స్పియర్

## విమాన పరికరాల ఫాక్టరీ:

ఉత్తర ప్రదేశ్‌లో సుల్తాన్‌పూర్ జిల్లాలోని 'కొర్వా' గ్రామంలో రూ. 32.7 కోట్ల పెట్టుబడితో ఒక విమాన పరికరాల ఫాక్టరీ నిర్మిస్తున్నారు. జాగ్వర్' విమానాలకూ, ఇతర యుద్ధ విమానాలకూ అవసరమైన ఎలెక్ట్రానిక్ పరికరాలను ఈ ఫాక్టరీ ఉత్పత్తి చేస్తుంది.

* * *

## ఇండియాలో మలేరియా తగ్గు ముఖం:

5 సంవత్సరాల కాలంలో ఇండియాలో మలేరియా వ్యాధి 60 శాతం దాకా తగ్గింది. 1976 లో 64 లక్షల మంది మలేరియా రోగ పీడితులుంటే, 1981 లో ఆ సంఖ్య 26 లక్షలకు తగ్గింది.

* * *

## ఇండియన్ చలన చిత్రాలకు క్రొత్త అవార్డులు:

ప్రపంచ ప్రసిద్ధమైన 'ఆస్కార్ అవార్డుల' పద్ధతిలో ఇండియాలో గూడా కొత్త అవార్డులు ఏర్పాటు చెయ్యడానికి ఇండియా ఫిలిం పరిశ్రమ వారు నిర్ణయించారు. ముందుగా హిందీ ఫిలింలకు ఈ అవార్డులను ప్రకటిస్తారు.

## ఇండియాలో ఎలెక్ట్రిక్ కారు:

వారణాసి (ఉ. ప్ర.) లోని 'షా ఇండస్ట్రియల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్' లోని శాస్త్రజ్ఞులు విద్యుచ్ఛక్తితో నడిచే కారు నమోనాను తయారు చేశారు. దానికి ఇంజన్ కాని, గేర్లు కాని అవసరం లేదు. స్టోరేజ్ బ్యాటరీలలోని లెడ్ ఆసిడ్' నుంచి ఇది శక్తిని గ్రహిస్తుంది. గంటకు 35 కి.మీ. ల వేగంతో ఈ కారు పయనించగలదు. ●

## 5 కోట్ల ఏళ్ల నాటి తాబేలు శిలాస్థి



ఫ్రాంక్‌ఫర్ట్ (ప. జర్మనీ) సమీపంలో ఎండిపోయిన ఒక నూనె బావి అడుగున రాళ్ళలో సెంకెన్ బెర్గ్ మ్యూజియమ్ ఉద్యోగులకు 5 కోట్ల ఏళ్ళనాటి ఒక తాబేలు శిలాస్థి (fossil) దొరికింది. ఇటీవల ఆ మ్యూజియమ్ సెర్టియరీ యుగానికి (6.5 కోట్ల సం. లకు ముందు) చెందిన శిలాస్థులెన్నో సేకరించింది. వాటిలో తాబేళ్ళు, పాములు, గబ్బిలాలు, ప్రస్తుతపు గుర్రానికి పూర్వరూపం అయిన 'కంగారూ' సైజు ఒక జంతువు కూడా ఉన్నాయి.

"ఒంటరిగా నడవడానికి సిద్ధపడిన వానికే భగవంతుని తోడు లభిస్తుంది." -స్వామీ రామతీర్థ

# ప్రపంచ మేధావులు

## నిత్య సత్యాన్వేషి

# సోకసు

శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వర రావు

గ్రీస్ దేశంలో ఏథెన్స్ నగరం. క్రీ.పూ. 399 వ సం. రం. లో ఒకానొక సాయం కాలం. స్థలం - జైలులో ఒక గది. అక్కడ తన మరణదండన అమలు కోసం సోక్రటీసు ఎదురు చూస్తున్నాడు.



సూర్యుడు ఇంకాసేపటికి అస్తమిస్తా డనగా జైలరు ఒక కప్పునిండా విషం తెచ్చి ఇలా అన్నాడు: "అయ్యా! నామీద కోపం చెయ్యకండి. మీ మరణదండనకు ఇతరులు బాధ్యులు - నేను కాదు!" విషం కప్పు ఆయన కందించి, వెక్కి వెక్కి రోదిస్తూ వెనక్కి మళ్ళాడు.

అక్కడ ఉన్న సోక్రటీసు మిత్రులకు దుఃఖం ఆగలేదు. కళ్ళవెంట ధారాపాతంగా అశ్రువులు కారుతున్నాయి. సోక్రటీసు మాత్రం నిమ్మకు నీరెత్తినట్టు ఉన్నాడు.

---

## ముఖచిత్ర వ్యాఖ్య

(ఫిబ్రవరి 1983)

"సర్వం ఎరుపు
ఆపై మరుపు
తెలుపును నీ వలపు!"

—వి. సుబ్బలక్ష్మి, ఎలమంచిలి.

* * *

"అద్దానికి ఇంత నేర్పు
ఎటుల వచ్చెనమ్మా!"

—టి. సావిత్రి, కురుపాం.

* * *

"చూడా చక్కని వనిత!
రోజారంగుల ముదిత!"

—జి. బాబూరావు, వడిశలేరు, (తూ॥ గో. జిల్లా)

---

"శాస్త్ర విజ్ఞానం ఒక సమస్యను పరిష్కరించేలోగా
మరో పది సమస్యలు తలెత్తుతూ ఉంటాయి!" —జార్జ్ బెర్నార్డ్ షా

ఆయన దృష్టిలో చావంటే మరింత పరిపూర్ణ మైన జీవితంలో ప్రవేశించడం. "ఏమిటి మీ వెర్రి? ఇలాంటి సన్నివేశం రాకూడ దనే స్త్రీ లందరినీ ఇక్కడ నుంచి పంపించి వేశాను. సంతోషంగా ఉండండి. సంతోషంగా నన్ను చవిపోనివ్వండి!" అని సోక్రటీసు తన అను చరులను మందలించాడు. చివరి సారిగా ప్రార్థన చేశాడు. నవ్వుతూ విషపాత్ర చేతి లోకి తీసుకుని గటగట తాగివేశాడు.

కొద్ది క్షణాలు ఇటూ అటూ పచార్లు చేశాడు. బలహీనంగా అనిపించి, మెల్లగా నేలమీద పడుకున్నాడు. క్రమంగా దేహం అంతటా విషం వ్యాపించింది. కొన్ని నిముషాలపాటు శరీరం వణికింది. దేహంలో చలనం ఆగి పోయింది.

"మనం ఎరిగినంతలో మిక్కిలి బుద్ధిశాలీ, మిక్కిలి న్యాయ శీలీ, మానవోత్తముడూ అయిన మన మిత్రుడు సోక్రటీసు ఆ విధంగా నిర్యాణం చెందాడు" అన్నాడు - ఆయన ప్రముఖ శిష్యుడు ప్లేటో!

ఒక శిల్పకారుని కుమారుడు సోక్రటీసు. తోటి పిల్లలతో పాటు బడికి వెళ్ళి తన బుద్ధినీ, శరీరాన్నీ ఎలా ఉపయోగించుకోవాలో శిక్షణ పొందాడు. యౌవన దశ రాగానే తండ్రి అడుగు జాడలలో రాళ్ళు మలిచే వృత్తి చేపట్టాడు. తమ దేశం యుద్ధంలో చిక్కు కోగా సైన్యంలో చేరాడు. కిమ్మనకుండా ఓర్పుగా ఎన్నో కష్టాలు అనుభవించాడు. యుద్ధానంతరం తన దగ్గిరికి వచ్చిన యువకు లకు బోధించడం మొదలు పెట్టాడు. ఎవ్వరితో అయినా ఏ విషయాన్ని గురించి అయినా నిస్సంకోచంగా ఆయన మాట్లాడే వాడు. వాళ్ళంతట వాళ్ళే తమ పొరపాట్లు గుర్తించేట్టు చేసేవాడు. 'ఇది కాదు', 'ఇది కాదు' అని ఒక్కొక్క దాన్నే పరిహరించుకుంటూ పోవడం ద్వారా సత్యాన్ని తెలుసుకోడం ఆయన మార్గం. వేటకుక్కలాగ అతి ఉత్సా హంగా ఆ మార్గం వెంట ఆయన ముందుకు సాగేవాడు.

## రష్యాలో బయటపడిన శిలా యుగం నాటి గ్రామం



సోవియట్ పురాతత్త్వ పరిశోధకులు ఇటీవల 200 ఇళ్ళతో కూడిన శిలాయుగం నాటి ఒక గ్రామాన్ని త్రవ్వి బయటికి తీశారు. కజక్‌స్థాన్‌లోని 'బోటాయ్'లో బయట పడిన మిక్కిలి పెద్ద గ్రామం ఇదే! అక్కడ లభించిన ఒక గుర్రపు కళ్ళెం 5,000 ఏళ్ళ క్రితం అక్కడ గుర్రాలు లాగే రథాలు వాడుకలో ఉన్నట్టు సూచిస్తుంది. అక్కడ నుంచే అవి ఇతర యూరప్, ఆసియా ఖండ దేశాలకు వ్యాపించి ఉండవచ్చును.

"ధనం, విద్య, కులం దుర్మార్గులకు గర్వాన్నీ,
సజ్జనులకు అణకువనూ కలిగిస్తాయి." -భాగవతం

అన్ని రకాల వ్యక్తులూ - ధనికులూ, పేదవారూ, కార్మికులూ, ఉద్యోగస్థులూ— అందరూ ఆయన దగ్గిరికి వచ్చేవారు. ఆయన వివేకం, ఆయన వినయం వారిని ఆకర్షించాయి. కాని, కొన్నాళ్ళకు కొందరు ఆయనను ద్వేషించడం మొదలుపెట్టారు. కారణం: తన ప్రశ్నలతో ఆయన వాళ్ళెంత అజ్ఞానులో స్పష్టం చేస్తున్నాడు. ఒకసారి ఆయన ఇలా అన్నారు. "నేను అజ్ఞానిననీ నాకు తెలియడమే నాలో ఉన్న వివేకమేమో! ఇతరులు కూడా నిజానికి అజ్ఞానులే! అయినా తాము బుద్ధిశాలులం అని వారు అనుకుంటున్నారు."

సోక్రటీసుకి 70 ఏళ్ళు నిండేసరికి ఏతెన్సులో శత్రువులు చాలా మంది తయారయారు. "ఇతడికి దేవుడిలో నమ్మకం లేదు. తత్త్వశాస్త్రం బోధించి యువకులను పాడు చేస్తున్నాడు" అని వాళ్ళ విమర్శ. ఏనిటస్ అనే తోళ్ళ వర్తకుడికి తన కుమారుణ్ణి కుల వృత్తి మాని, తత్త్వశాస్త్రం అధ్యయనం చెయ్యడానికి ప్రోత్సహిస్తున్నాడని సోక్రటీసు మీద కోపం వచ్చింది. ఎలాగైనా ఆయనను మట్టు పెట్టాలని ఆలోచించాడు. న్యాయస్థానంలో ఆయనమీద అభియోగం తెచ్చాడు. "యువకులను ఇతడు పెడమార్గం పట్టిస్తున్నాడు. అందుచేత ఇతనికి మరణదండన విధించాలి"అని వాదించాడు. ప్రశ్న లడుగుతూ యువకులలో తన భావాలు ప్రచారం చెయ్యడం మానివేస్తే కేసు ఉపసంహరించుకుంటానన్నాడు. కాని అందుకు సోక్రటీసు ఒప్పుకోలేదు. "నాకు మీరు మరణదండన విధిస్తే దానివల్ల నా కేమీ హాని కలుగదు. మీకు మీరే హాని చేసుకున్నవా రవుతారు" అన్నాడు. న్యాయాధిపతులు అతని నేరం రుజువైనట్టు భావించారు. మరణదండన విధించారు. తీర్పు విని సోక్రటీసు ఇలా అన్నాడు:

"మంచివాడికి ఈ జీవితంలో గాని, అటు తరువాత గాని ఎలాంటి హానీ జరుగదు. మనం విడిపోయే గడియ వచ్చింది. ఇక ఎవరి దారి వారిది. నా దారి మృత్యువు వేపు; మీ దారి జీవితం వేపు! అయితే - మనలో

## సర్వాకారపు రాబట్లు



రాబట్ల (మర మనుష్యుల) వాడకంలో పారిశ్రామిక దేశాలు ఒక దానితో ఒకటి పోటీ పడుతున్నాయి. ప.జర్మనీలో ఇప్పటికే 2,500 రాబట్లు పరిశ్రమలలో పని చేస్తున్నాయి. జర్మనీలో తయారయ్యే సర్వాకారపు రాబట్లు శిక్షణ ఇవ్వడానికి కూడా ఉపయోగిస్తున్నాయి. తేలిక పరిశ్రమల లోనూ, ప్రయోగశాలలలోనూ వాటిని వాడుతున్నారు.

"ప్రేమికులు పెళ్ళి చేసుకున్న మరుక్షణం వారి ప్రణయం అంతరించి, చరిత్ర ఆరంభం అవుతుంది." —బ్రూస్

ఎవరం మేలైన గమ్యం చేరుకుంటామో ఆ దేవతలకు తప్ప వేరెవ్వరికీ తెలియదు."

ప్రాచీన తత్త్వవేత్తలలో ప్రముఖుడైన సోక్రటీసు "నిరంతరాన్వేషణం ద్వారా మీ నిజతత్త్వం మీరు తెలుసుకోండి!" అని యువకులకు బోధించాడు. ఆయన దృష్టిలో మన వ్యక్తిత్వ వాస్తవాన్ని తెలుసుకోడానికి తోడ్పడే ఆలోచన ప్రక్రియే తత్త్వశాస్త్రం. బొర్రముక్కు, లావుపాటి పెదవులు, పొడుచుకొచ్చిన కనుగ్రుడ్లు, స్థూలకాయంతో అందవికారంగా కనిపించే సోక్రటీసు 'టో-టీ?' (అంటే - ఏమిటి?) అనే ప్రశ్ననే రెట్టిస్తూ తత్త్వ బోధ చేసేవాడు. చెప్పులు కూడా లేకుండా ఏథెన్స్ నగర వీథులలోనూ, మార్కెట్ దగ్గిరా నిలబడి అందరితోనూ ఆయన చర్చలు సాగించేవాడు. ఎంతో ఆసక్తితో ప్రజలు ప్రశ్న లడిగేవారు. ఓర్పుగా సత్యం తెలుసుకోడానికి ఆయన వారికి తోడ్పడేవాడు. అలా నిరంతరం బోధిస్తూ, నిరంతరం నేర్చుకుంటూ ఉండడం ఆయనకు ఎంతో సంతోషం కలిగించేది.

సోక్రటీసుకి సౌందర్యమే సత్యం. సత్యమే దేవుణ్ణి చేర్చే రాచబాట!

మృత్యువును ధైర్యంగా ఎదుర్కొన్న మహనీయుడు సోక్రటీసు. ఆయన ఇలా అన్నాడు: "చావు నుంచి తప్పించుకోడం కంటె పాపం నుంచి తప్పించుకోడం కష్టం. చావు కంటె వేగం గలది పాపం. 'చావు' నన్ను కబళిస్తుంది. కాని నా మీద అభియోగం తెచ్చిన వారిని వారి క్రూరత్వం, పాపం కబళిసాయి!"

విషం త్రాగడానికి ముందు సోక్రటీసు శిష్యులకు ఇచ్చిన చివరి ఉపదేశం: "ఆత్మ నిత్యం. దేవుడి మందిరానికి చేర్చే వరండా లాంటిది మృత్యువు. సంతోషంగా ఉండండి! నా చావుకి దుఃఖపడకండి. ఖననం చేసేటప్పుడు మీరు నా శరీరాన్ని సమాధి చేస్తారు కాని, నా ఆత్మను కాదు!" ●

## మిక్కిలి పెద్ద విమానాశ్రయం



అట్లాంటా (అమెరికా) లోని హార్ట్స్‌ఫీల్డ్ అంతర్జాతీయ విమానాశ్రయమే ప్రస్తుతం ప్రపంచంలో మిక్కిలి పెద్ద విమానాశ్రయం. వెనుక రెండు 'రన్ వే'లతో కూడిన చిన్న విమానాశ్రయానికి ప్రక్కనే 153 హెక్టేర్ల స్థలంలో 50 కోట్ల డాలర్ల ఖర్చుతో నిర్మించిన ఈ విమానాశ్రయానికి 1980 సెప్టెంబరులో ప్రారంభోత్సవం జరిగింది. 4 'రన్ వే'లూ, 138 గేట్‌లూ, 12,000 కార్లు పార్కు చేసేందుకు స్థలం ఉన్న ఈ విమానాశ్రయం ఏటా 7.5 కోట్ల ప్రయాణీకులకు ఉపయోగపడుతూంది.

"తల్లి గర్భంలో ఉన్నప్పుడే మనిషి ఆయుస్సు,
కర్మ, ధనం, విద్య, మృత్యువు నిర్ణయం అవుతాయి." -చాణక్యుడు

# కార్టూనులు గీయటం ఎలా?

టి. వెంకటరావు

## 17
## చలనం

మంచి కార్టూనిస్ట్ కావా లంటే మీరు బొమ్మల్ని సరిగ్గా గీయడం నేర్చుకో వాలి. మీరు గీసిన బొమ్మలు నిర్జీవమైన శిలా ప్రతిమల్లాగ ఉండ కూడదు. అంటే బొమ్మ లలో చైతన్యం, జీవం ఉట్టిపడేట్టు ఆకర్షకం





గానూ, స్ఫుటంగానూ ఉండేట్టు గియ్యాలన్న మాట! వివిధ చలనాలలో ఉన్న వ్యక్తులను- నడుస్తున్నట్టూ, పరుగెత్తుతున్నట్టూ, గెంతు తున్నట్టూ, పని చేస్తున్నట్టూ, ఆడుకుంటు న్నట్టూ, నాట్యం చేస్తున్నట్టూ - గియ్యడం అభ్యాసం చెయ్యండి! మొదటి దశలో రేఖా చిత్రం గీసుకునేటప్పుడే వ్యక్తిలో ఆ చలనం

## పాఠకుల అభిప్రాయాలు

(ఫిబ్రవరి 1983)

"మంచి వారి చెలిమి
తరిగిపోని కలిమి!"

—పసుమర్తి పద్మనాభన్, సూళ్లూరుపేట.

* * *

"విద్యార్థులు బయట హీరోలు
పరీక్షలో మాత్రం జీరోలు!"

—యం. అంజారెడ్డి, గాలిపల్లి
(కరీంనగర్ జిల్లా)

---

"రహస్యాలు కాగితం మీద పెట్టకూడదు: పైకి విసిరిన రాయి లాగ అవి ఎప్పుడు నెత్తిమీద పడేదీ తెలియదు" —కాల్టెరాస్





కనిపించాలి. అలా చాలా రోజులు అభ్యాసం చెయ్యండి. దీనివల్ల వేర్వేరు చలనాలలో ఉన్న వ్యక్తులను ఎలా గియ్యాలో అర్థం అవుతుంది. (సశేషం)

## భావపరిచయ పోటీ
(ఫిబ్రవరి 1983)

"నాన్నగారు పొగతాగితే ఒప్పు!
నేను తాగితే ఎందుకు తప్పు?

—జి. ఆర్. దేవేంద్రబాబు,
తిరుపతి.

* * *

"తండ్రి ముందు గప్‌చిప్!
తరువాత గుప్‌గుప్!!"

—సామంచి సుబ్బలక్ష్మి,
విజయనగరం.

* * *

"పిల్లలున్నారు జాగ్రత్త!
అనుకరిస్తారు తరువాత!"

—పి. శ్రీనివాసరెడ్డి,
హైద్రాబాద్.

## ఏటా విదేశాలకు వలసపోయే ఇండియన్ డాక్టర్లు

ఏటా సుమారు 1,000 మంది ఇండియన్ డాక్టర్లు విదేశాలకు వలసపోతున్నారు. వీరిలో ఒక్కొక్కరి క్రింద మనదేశం పెట్టిన ఖర్చు: రూ. 3 లక్షలు!

## మిక్కిలి పెద్ద మత సంస్థ

ప్రపంచంలో మిక్కిలి పెద్ద మత సంస్థ రోమన్ కేతలిక్ చర్చ్. 4,03,672 మంది ప్రీస్ట్‌లూ, 9,38,881 మంది నన్‌లూ అందులో పని చేస్తున్నారు. కార్డినల్‌లూ, ఆర్చ్ బిషప్‌లూ, బిషప్‌లూ కలిపి మొత్తం 2,947 మంది ఉన్నారు. 4,20,000 చర్చ్‌లు ఈ మత సంస్థ క్రింద పని చేస్తున్నాయి.

"కోట్ల ప్రాణులతో కలకల లాడే తిరునాళ్ళ ఈ విశ్వం!
మూడు నాళ్ళ ముచ్చట అని విరసించడం అవివేకం!" —రవీంద్రుడు

# నిజాలు-నిదర్శనాలు

## పాముకాట్లు ఎక్కడ ఎక్కువ?

ఇండియాలోని ఇతర ప్రాంతాలలో కంటె గోవా, డయ్యూ, డామన్‌లలో పాము కాట్లు 10 రెట్లు ఎక్కువ.

* * *

## గ్రామాలలో దరిద్రుల ఆధిక్యం:

ఇండియాలో దారిద్ర్య రేఖకు దిగువను బ్రతికే 30.6 కోట్ల మందిలో 24 కోట్ల మంది పల్లెలలోనే కనిపిస్తారు.

* * *

## 2,000 వ సం.రం నాటి ప్రపంచ నగరాలు:

ప్రపంచంలో 10 లక్షలు మించిన జనాభా గల నగరాలు 1950 లో 71 మాత్రమే ఉంటే, 1975 నాటికి ఆ సంఖ్య 181 అయింది. ఈ లెక్కను చూస్తే 2,000 వ సం.రంలో ఈ సంఖ్య 400 దాటవచ్చు. 50 లక్షల జనాభా ఉన్న నగరాలు (1950 లో 6, 1975 లో 21 మాత్రమే) 59 కి, 1 కోటి జనాభా ఉండే నగరాలు (1950 లో 2, 1975 లో 21 మాత్రమే) 27 కి పెరుగవచ్చు!

## 'హాలీ' తోకచుక్క పరిశీలన



76 ఏళ్ళ తరువాత 1986 మార్చిలో పృథ్వీ సౌర కుటుంబం చేరువకు వస్తున్న 'హాలీ' తోక చుక్కను సూక్ష్మంగా పరిశీలించడానికి రష్యా, ఫ్రాన్స్, ఆస్ట్రియా, ప జర్మనీల సైంటిస్టులు సంయుక్తంగా 'వేగా' అనే అంతరిక్ష నౌకను పంపబోతున్నారు. 1986 మార్చి 8 న ఈ నౌక తోక చుక్క కేంద్రానికి 10,000 కి.మీ. ల దూరం చేరుకొని, అక్కడి నుంచి తాను సేకరించిన భోగట్టాను భూమి మీదికి పంపుతుంది. 'జీవి' అవతరణకు అవసరమైన గ్యాస్‌నీ, సేంద్రియ పదార్థాన్నీ (organic matter) తోక చుక్కలు భూమి మీదికి తెస్తున్నా యనే సిద్ధాంతాన్ని పరీక్షించడానికి ఆ భోగట్టా ఉపయోగపడుతుం దని తెలుస్తూంది.

"యుద్ధాని కెప్పుడూ సంసిద్ధంగా ఉండడమే శాంతి రక్షణకు సరియైన ఉపాయం." —వాషింగ్టన్

## అపర ధాన్యాలలో బెల్జియమ్ అగ్ర స్థానం:

బ్రిటన్‌లో రైతులు హెక్టేరుకు 2,230 కి.గ్రా.ల అపర ధాన్యాలు పండిస్తే, బెల్జియం రైతులు హెక్టేరుకి 3,414 కి.గ్రా.ల దిగుబడి సాధిస్తున్నారు. ప. జర్మనీ, బర్మా, బంగ్లాదేశ్, చైనాలు వరుసగా హెక్టేరుకు 2,866 కి.గ్రా లూ, 575 కి.గ్రా.లూ, 697 కి.గ్రా.లూ, 1028 కి.గ్రా.లూ పండిస్తున్నారు.

* * *

## ఆయుర్దాయావకాశంలో 10 ఏళ్ల పెరుగుదల:

అభివృద్ధి పొందని దేశాల్లో 1930 లో ప్రజల ఆయుర్దాయావకాశం 32 ఏళ్ళు మాత్రమే ఉండేది. అలాంటిది గత 25 సం.ల కాలంలో ప్రపంచం అంతటా ప్రజల ఆయుర్దాయావకాశం 10 ఏళ్ళు పెరిగింది.

* * *

## పొగాకు పంటలో ఆంధ్రుల ప్రత్యేకత:

వర్జీనియా పొగాకు కేవలం ఆంధ్రప్రదేశ్ లోనే పండిస్తున్నారు. 1.68 లక్షల హెక్టేరులలో ఏటా 1.56 లక్షల టన్నుల పొగాకు ఇక్కడ పండుతూంది. 35 దేశాలకు ఎగుమతి అవుతున్న ఈ పొగాకువల్ల రూ. 110 కోట్ల విదేశీ మారక ద్రవ్యం ఆంధ్రులు సంపాదించి పెడుతున్నారు.

## అయ్యే ఖర్చు:

అమెరికాలో ఆసుపత్రిలో రూముకి రోజుకి ఛార్జి రూ. 1,600 లు. ఒక సగటు అమెరికన్ కుటుంబం తన రాబడిలో 10 శాతం వైద్యం క్రింద ఖర్చు పెడుతుంది.

* * *

## ఇండియాలో నేత్ర రోగులు:

ఇండియాలో నేత్ర వ్యాధులతో బాధ పడుతున్నవారు 4.5 కోట్ల మంది ఉన్నారు. వీరిలో దాదాపు 90 లక్షల మంది పూర్తిగా గ్రుడ్డివారు. ●

## బాల్‌రూమ్ డాన్స్‌లో ఛాంపియన్‌లు



ప. జర్మనీకి చెందిన 30 ఏళ్ళ వయస్సు గల డాక్టరు మాక్స్ ఉల్రిఖ్ బుష్, 29 ఏళ్ళ వయస్సు గల ఒక క్రీడల ఉపాధ్యాయిని రెనేట్ హిల్గర్డ్‌లు ఇటీవల ఫ్రాంక్‌ఫర్ట్‌లో జరిగిన 'బాల్‌రూమ్' డాన్స్ పోటీలలో ప్రపంచ ఛాంపియన్ షిప్ గెలుచుకున్నారు.

---

"మనం భాగ్యవంతులం అయితే బాధలు పడేవారికి సలహా లివ్వడం తేలిక!" —ఈస్కులస్

# మీ ప్రశ్నలు

ఏప్రిల్ 1983

శ్రీమతి పి. భానుమతీ రామకృష్ణ

జె. మన్మథ్ లక్ష్మణ్, సాలూరు.

"భక్తులు దేవుని దర్శనానికి వచ్చి కళ్ళు ఎందుకు మూసుకుంటారు?" (ఉత్తమ ప్రశ్న)

• ఆ దేవతా మూర్తిని తమ కళ్ళలో దాచుకొని అంతరాత్మ అనే అద్దంలో మళ్ళీ మళ్ళీ దర్శించడానికి.

కె. విజయ దుర్గాదేవి, రాజమండ్రి.

"మనిషి చేసే పాప పుణ్యాలకు ఫలితం ఈ జన్మలోనే అనుభవిస్తాడంటాను. మీరేమంటారు?"

• నిజమే నంటాను - కొందరి విషయంలో: "అత్యుత్కటైః పుణ్య పాపైరిహైవ ఫల మశ్నుతే" అన్నారు పెద్దలు. మితి మీరి చేసే దుష్కార్యాల ఫలితం ఈ జన్మలోనే పొందుతారు.

• • •

కె.ఎన్. భాస్కర్, చిట్టూరు.

"మనకు నిజంగా స్వాతంత్ర్యం ఉందంటారా?"

• మంచి ప్రశ్న! అసలు స్వాతంత్ర్యం అనే మాటకు అర్థం తెలిస్తే కదా! - అది ఉందో, లేదో తేల్చుకోడానికి: స్వాతంత్ర్యం పరమార్థం తెలిసిన వారూ, దానిని సాధించిన వారూ కాలగర్భంలో కలిసి పోయారు. ఇప్పుడున్నది కేవలం 'కుతంత్రం!'

## ఇండియాలో తొలి వార్తా పత్రిక



ఇండియాలో వచ్చిన మొట్టమొదటి వార్తా పత్రిక 'హికీస్ బెంగాల్ గజెట్' లేక 'కలకత్తా జనరల్ అడ్వర్టైజర్'. జేమ్స్ అగస్టస్ హికీ దానిని ఇంగ్లీషులో కలకత్తా నుంచి ప్రచురించేవాడు. 1780 జనవరి 29 శనివారం నాడు తొలిసంచిక బయటికి వచ్చింది.

"సమకాలీన సంఘజీవనంలోని ఛాయాలను ప్రతిఫలించటం సాహిత్యం హక్కు, బాధ్యత కూడా!" — చెఖ్

మాదిరెడ్డి వెంకట శివారెడ్డి,
కొత్త మూర్వకొండ.

"హైదరాబాద్‌లో నిర్మించే చిత్రాలకు రూ. 1½ లక్ష సబ్సిడీ ఇచ్చే బదులు పాత చిత్రాలకు పన్ను మినహాయింపు లాంటి సౌకర్యం ప్రభుత్వం కల్పిస్తే బావుంటుం దంటాను. మీరే మంటారు?"

* నిజమే! కాని అక్కడ అంత దూరం ఆలోచించే వ్యవధి ఎవరి కుంది? పాపం!

* * *

ఖాజాబీ సాహెబ్, ఇనగలూరు.

"సాధారణంగా చాలా కుటుంబాల్లో అత్తా, కోడళ్ళ మధ్య (కోడలు మంచిదైనా) సఖ్యత ఉండదు. కారణం ఏమిటి?"

* ప్రతి కోడలూ ఇంకో తల్లి కూతురు కావడం వల్ల! అంత వరకూ తనకే సొంత మైన తన కొడుకు ఆదరాభిమానాలలో మరో ఆడది ముఖ్య భాగస్థురాలు కావడంతో అత్త గారిలో చెలరేగే ఈర్ష్య వల్ల!

* * *

పి. భిక్షాపతి, సికింద్రాబాదు.

"మనిషి ఉన్నత స్థితికి రావా లంటే దైవ కృప ముఖ్యమా? మానవ ప్రయత్నమా?"

* ముఖ్యంగా దైవ కృప! అదే పూర్వ జన్మ సుకృతం వల్ల లభించేది. అయితే - మానవ ప్రయత్నం కూడా దాన్ని అనుస రించాలి.

* * *

బలిజేపల్లి, మొందెపులంక.

"గాలి కొడితే అందరికీ తగులుతుంది. దేవు దుంటే అందరికీ ఎందుకు కనిపిం చడు?"

* గాలి తగుల్తుందే గాని కనిపించడం లేదు గదా! దేవుడూ అంతే! గాలిలాగే సర్వ వ్యాపియైన దేవుడి అనుగ్రహం నీకు కని పించకుండానే నిన్ను కనిపెడుతూ ఉంటుంది.

* * *

ఇంద్రగంటి మధుసూదనరావు,
నెల్లూరు.

"ఆత్మ సాక్షాత్కారం పొందిన మానవుడు దేవునితో సమానమా?"

## సెంటిగ్రేడ్ థెర్మామీటర్ కనిపెట్టిన ఖగోళ శాస్త్రజ్ఞుడు




18వ శతాబ్ది నాటి స్వీడిష్ ఖగోళ శాస్త్ర జ్ఞుడు ఆండర్స్ సెల్షియస్ సెంటీగ్రేడ్ థెర్మా మీటరు కనిపెట్టాడు. ఉష్ణోగ్రతను కొలిచే ఈ కొలమానంలో 100 విభాగాలు (డిగ్రీలు) ఉంటాయి. నీరు గడ్డ కట్టే బిందువు 0° గానూ, నీరు ఆవిరిగా మారే బిందువు 100° గానూ గు రింపబడి ఉంటుంది.

"తాను తెలివి గలవాడ నని విర్రవీగే వాడు
పాపం ఎంత గొప్ప మూర్ఖుడో కదా!" —వాల్టేర్

* 'సమానమా?' ఏమిటి? దేవుడే! మానవాతీతులకే అది సాధ్యం!

* * *

బి.వి.అర్.ఎస్.ఎస్.ఎస్. ప్రసాద్, విశాఖపట్నం.

"మనిషిచేత కర్మ చేయించేది భగవంతుడే కదా! మరి ఆ కర్మ ఫలితం మానవుడికి ఎందుకు చెందుతుంది?"

* భగవద్గీత శ్రద్ధగా చదువు బాబూ! అందులో శ్రీకృష్ణ పరమాత్మ అన్నీ వివరంగా చెప్పాడు.

* * *

కే. ఫెలిక్స్ కాల్, ఆదోని.

"సాటి ఆడదాని భర్తను వల్లో వేసుకున్న పెళ్ళి కాని ఆవిడకు మీరేం సలహా ఇస్తారు?"

* ఆ సాటి ఆడదానితో సంప్రదించి (అతడే తనకు భర్త కావా లనుకుంటే) ఆవిడకు అభ్యంతరం లేకపోతే వారిద్దరికీ సేవ చేస్తూ బ్రతక మంటాను. ఇవన్నీ ప్రారబ్ధ కర్మ ఫలితాలు! సలహాలు పని చేయవు.

* * *

ఎస్. సత్యనారాయణ, భోరంపేట.

"రామాయణం 'కట్టె, కొట్టె, తెచ్చె' - అని మూడు మాటలలో చెప్పినట్టు ప్రేమాయణం మూడు మాటల్లో చెప్పండి - ప్లీజ్!"

* పుట్టె, పెరిగె, పోయె!

* * *

ఎస్.ఎ. సలీమ్, గుంటూరు.

"స్త్రీలు అందంగా ఉంటారా? పురుషులు అందంగా ఉంటారా?"

* అసలు అందానికి నీ నిర్వచనం చెప్పు! ఆత్మ సౌందర్యమా? శారీరక సౌందర్యమా? - ఏది నీ వడిగేది?

* * *

కె.వి.ఎల్. నరసింహశాస్త్రి, విజయవాడ.

"'అరవ చాకిరీ' అనే పదం ఎలా వచ్చింది?"

* సాధారణంగా అరవ వారు (తమిళులు) తక్కువ తిండి తిని ఎక్కువ చాకిరీ చేస్తారు. బహుశః అందువలన ఆ మాట వాడుకలోకి వచ్చి ఉండవచ్చు. ●

## సౌర విద్యుత్తుతో పని చేసే కాల్క్యులేటర్



బాటరీలు అక్కర లేకుండా దానిలోనే 'సౌర ఘటాలు' (solar cells) అమర్చిన సౌర విద్యుత్తుతో పనిచేసే 'కాల్క్యులేటర్'లు తయారు చెయ్యడానికి నమూనా సిద్ధమైంది. ఆశ్చర్యకరమైన ఈ కొత్త యంత్రంలో మామూలు కాల్క్యులేటర్లో లేని నూతన సౌకర్యాలు కూడా అనేకం ఉంటాయి.

"కష్టనష్టాలు అనుభవించిన తర్వాత కాని మనిషికి వినయం, వివేకం కలుగవు." —ఫ్రాంక్లిన్

# విశ్వాసంతో విశ్వాసం

శ్రీ రామకృష్ణ పరమ హంస

అనగా అనగా ఒక గొల్లపడుచు. నది అవతలి ఒడ్డున తపస్సు చేసుకొంటున్న ఒక మునికి రోజూ ఆమె పాలు తీసుకు వెళ్ళేది. ఒక రోజు పాలు తేవడం ఆలస్యమైందని ముని చిరాకుపడ్డాడు. 'పడవ వాడు నది దాటించడం ఆలస్య మైంది సామీ!' అంది ఆమె. "భగవన్నామం స్మరిస్తూ ప్రజలు



సంసార సముద్రాన్నే అవలీలగా దాటుతున్నారు గదా - ఈ చిన్న నదిని నువ్వు దాటలేవా?" అన్నాడు ముని.

ఆ రోజు తరువాత గొల్ల పడుచు పాలు తేవడం ఎన్నడూ ఆలస్యం కాలేదు. ఒక రోజున ముని ఆమెను "వేళ తప్పకుండా ఎలా రాగలుగుతున్నా?" వని అడిగాడు. "తమరు చెప్పిన ప్రకారం భగవన్నామం చేసుకుంటూ, అవలీలగా నదిని దాటేస్తున్నాను సామీ!" అంది గొల్ల పడుచు. మునికి ఆశ్చర్యం కలిగింది. ఆమె మాటలలో నమ్మకం కుదరక ఒక రోజున ఆమె నది ఎలా దాటుతుందో చూద్దామని ఆమె వెంట బయలుదేరాడు. భగవన్నామం చేసుకుంటూ నిర్భయంగా ఆమె నది కడ్డంపడి పోతూంది. ఆమె వెంట బట్టలు చేత్తో పైకి పట్టుకుని నదిలో దిగిన మునిని చూసి ఫక్కున నవ్వుతూ ఆమె ఇలా అంది: "బట్టలు తడవకుండా అలా పైకి పట్టుకుంటారేమిటి సామీ! మీరే గదా చెప్పారు - భగవన్నామం చేస్తూ ఉంటే అవలీలగా నదిని దాటవచ్చు నని. మీ మాటల్లో మీకే నమ్మకం లేదా సామీ!" ●

## శని గ్రహం చుట్టూ అత్యధిక ఉష్ణోగ్రత

1981 ఆగస్టు 26 నాడు శని గ్రహాన్ని సమీపించిన వాయేజర్ II ఆ గ్రహం చుట్టూ సౌర కుటుంబం అంతటిలోకీ ఎక్కువ ఉష్ణోగ్రత గల వాతావరణం - 60 కోట్ల డిగ్రీల ఫారన్‌హీట్ మొదలు 100 కోట్ల డిగ్రీల ఫారన్‌హీట్ దాకా - ఉన్నట్టు తెలియజేసింది. సూర్యుని ఉపరితలం ఉష్ణోగ్రత 10,000 డిగ్రీలు ఫారన్‌హీట్ మాత్రమే!

"అజ్ఞాని మనస్సు అతని నాలుకలోనే ఉంటుంది: జ్ఞాని నాలుక అతని హృదయంలో ఉంటుంది." —క్వార్లెస్

# కొవ్వొత్తుల కథ

చాలా ప్రాచీన కాలంలోనే కొవ్వొత్తులు తయారు చెయ్యడం మొదలు పెట్టినట్టు కనిపిస్తుంది. ఈజిప్ట్, గ్రీస్ దేశాలలో క్రీ.పూ. 3,000 ఏళ్ళనాటి కొవ్వొత్తులు కూడా లభించాయి. కొవ్వొత్తులకు పూర్వం బెరడు ఒలిచిన రెల్లు కాడలను 'గ్రీజు'లో ముంచి దీపాలుగా వెలిగించేవారు.



క్రమంగా గుడ్డ వత్తులు అమర్చిన జనప కాడలను 'టాలో' అనబడే జంతువుల కొవ్వులో ముంచి వెలిగించే ఆచారం వచ్చింది. ఈ 'టాలో కొవ్వొత్తులు' మధ్య యుగంలో యూరప్‌లో విస్తారంగా వాడుకలో ఉండేవి. ఈ కొవ్వొత్తులు తయారు చేసే పని వారు సంచారదళాలుగా ఏర్పడి ఇల్లిల్లూ తిరిగి వారికి కొవ్వొత్తులు తయారుచేసి పెడుతూ ఉండేవారు. 18వ శతాబ్దం మధ్య భాగం దాకా - టాలో, మైనం - ఈ రెండే కొవ్వొత్తుల తయారీలో ప్రధానంగా వాడబడేవి. తరువాత క్రమంగా అనేక రాసాయనిక ప్రక్రియలు వచ్చాయి. ప్రస్తుతం పేరాఫిన్ మైనంతోనే ప్రపంచంలోని కొవ్వొత్తులలో



## ప్రపంచం శాంతి నిలయం కావాలంటే?

హృదయంలో 'నిజాయితీ' ఉంటే
నడవడిలో 'హుందాతనం' వస్తుంది;
నడవడిలో 'హుందాతనం' వస్తే
ఇంట్లో 'సామరస్యం' ఏర్పడుతుంది;
ఇంట్లో 'సామరస్యం' ఏర్పడితే
జాతికి 'క్రమశిక్షణ' అలవడుతుంది;
జాతికి 'క్రమశిక్షణ' అలవడితే
ప్రపంచం 'శాంతి నిలయం' అవుతుంది.

"లోకమును సంస్కరింప బూనుటకు ముందుగా
సంస్కారము తనతో ఆరంభము కావలెను." —వీరేశలింగం పంతులు

అధిక భాగం తయారవుతున్నాయి. ముంచడం (dipping), పోతపోయడం (moulding) లాంటి 5 ప్రక్రియల ద్వారా కొవ్వొత్తులు తయారుచేస్తున్నారు.



ఇప్పటికీ కొవ్వొత్తులకు ప్రధాన మైన కొతాదారు చర్చి. ఈస్టర్, క్రిస్టమస్ లాంటి పండుగల ముందు కొవ్వొత్తుల అమ్మకం విపరీతంగా పెరుగుతుంది. పొడుగాటి కొవ్వొత్తులు. సాధారణంగా చర్చిలోని వేది కల కోసమే తయారుచేస్తారు. యూరప్‌లో కొన్ని దేశాలలో మిక్కిలి కళాత్మకంగా కొన్ని కొవ్వొత్తులు తయారుచేస్తున్నారు. జర్మన్‌లకూ, స్కాండినేవియా దేశాలవారికీ కొవ్వొత్తు లంటే చాలా ఇష్టం. ఎవరినైనా భోజనానికి గాని, ఫలహారానికి గాని ఆహ్వానిస్తే అందమైన స్టాండులలో అమర్చిన రంగు రంగుల కొవ్వొత్తులు విధిగా డైనింగ్ టేబిల్‌మీద వెలిగిస్తారు. అదొక లాంఛనం.

కొవ్వొత్తులు అన్నీ వెలిగించేందుకే కాదు. 10 డాలర్ల (రూ. 90 లు) కంటె ఎక్కువ ఖరీదు చేసే కొవ్వొత్తులను కేవలం అలంకార ప్రాయంగా ఇంట్లో పెట్టుకుంటారు. ●

## మిక్కిలి ఎక్కువగా అమ్ముడయ్యే పుస్తకం!

ప్రస్తుతం జార్జ్ ఇ. డెల్యూరీ సంపాద కత్వంలో 'న్యూస్ పేపర్ ఎంటర్ ప్రైజెస్ అసోసియేషన్' (న్యూయార్క్) వారు ప్రతి సంవత్సరం ప్రచురిస్తున్న 'ది వరల్డ్ ఆల్మనాక్ అండ్ బుక్ ఆఫ్ ఫాక్ట్స్' ప్రపంచంలో మిక్కిలి ఎక్కువ కాపీలు ఖర్చవుతున్న పుస్తకం. 113 ఏళ్ళ క్రితం 1868 లో తొలి ముద్రణ వెలువడిన ఈ గ్రంథం ఏటా 4 కోట్ల కాపీలు ఖర్చవుతూంది.

## అంకెల గారడీ

$1 \times 8 + 1 = 9$

$12 \times 8 + 2 = 98$

$123 \times 8 + 3 = 987$

$1234 \times 8 + 4 = 9876$

$12345 \times 8 + 5 = 98765$

$123456 \times 8 + 6 = 987654$

$1234567 \times 8 + 7 = 9876543$

$12345678 \times 8 + 8 = 98765432$

$123456789 \times 8 + 9 = 987654321$

—సేకరణ : బి. మహేష్ కుమార్, పాలకొండ (శ్రీకాకుళం జిల్లా)

"తిరిగి అటువంటి చెడ్డపని చేయక పోవడమే నిజమైన పశ్చాత్తాపం!" —లూథర్

# మాకు తెలుసా:

బెల్జియమ్‌లో అధికార భాష:

యూరప్ ఖండంలోని బెల్జియమ్ దేశంలో అధికార భాష ఫ్లెమిష్.

* * *

ప్రపంచంలో 'ప్రెసిడెంట్' అయిన మొదటి మహిళ:

ద. అమెరికాలోని అర్జెంటీనా అధ్యక్ష స్థానానికి ఎన్నిక అయిన మేరియా పెరోన్ ప్రపంచంలో 'ప్రెసిడెంట్' అయిన తొలి మహిళ।

* * *

సైనిక దళం లేని రాజ్యం:

మధ్య అమెరికాలోని 'కోస్టా రికా' అనే రాజ్యానికి సొంత సైనిక దళం లేదు.

* * *

అండమాన్, నికోబార్ దీవుల సంఖ్య:

అండమాన్ దీవులు 204; నికోబార్ దీవులు 19. ఇండియా పాలనలో బంగాళా ఖాతంలో ఉన్న ద్వీప సముదాయాలు ఇవి.

* * *

ఎర్ర సముద్రం ఎందుకు ఎర్రగా ఉంది?

ప. ఆసియాలోని ఎర్ర సముద్రం ఎర్రగా ఉండడానికి దానిలోని లక్షలాది ఎర్రని మొక్కలు కారణం।

విమానాలలో 'హీలియమ్' ఎందుకు వాడుతారు?

హీలియమ్ ఉదజని (hydrogen) కంటె బరువైందే అయినా దానికి తేలికగా అంటుకొనే స్వభావం లేకపోవడం వల్ల జెట్ విమానాలలో దానిని వాడుతున్నారు. ●

## మిక్కిలి పెద్ద యుద్ధ నౌకలు



అమెరికా నౌకా దళానికి చెందిన విమాన వాహక నౌకలు - 'యు.ఎస్ ఎస్. నిమిట్జ్', 'డ్వైట్ డి. ఐసెన్ హోవర్'లు - ప్రపంచంలో కల్లా మిక్కిలి పెద్ద యుద్ధ నౌకలు. 1,092 అ.లు పొడుగు గల ఆ నౌకలు గంటకు 30 నాట్‌లు ప్రయాణించగలవు. 6,100 నావికులు పనిచేసే ఆ నౌకలకు న్యూక్లియర్ రియాక్టర్‌లు శక్తిని సమకూరుస్తున్నాయి. 1977 అక్టోబర్ 18 న జల ప్రవేశం చేసిన 'ఐసెన్ హోవర్' ఖరీదు సుమారు 200 కోట్ల డాలర్లు.

"అపరాధాలకూ, అల్లర్లకూ మూలహేతువు దారిద్ర్యం." —అరిస్టాటిల్.

# మనశ్శాంతికి రాచబాట

నేడు మానవ జాతి ఎదుర్కొంటున్న గొప్ప ఆపదలలో ఒకటి - వంచనకూ, దుష్టత్వానికీ ప్రాధాన్యం సంఘంలో నానాటికీ పెరిగిపోతూ ఉండడం! నిజాయితీని గురించి గాక ఈ దుర్గుణాలను గురించే తరుచు మనం మాట్లాడడం జరుగుతూంది. జీవితంలో



విజయం సాధించా లంటే ఈ దుర్గుణాలు తప్పనిసరి అనే భావం మన యువకులలో క్రమంగా బలపడుతూంది. 'జీవిత పోరాటంలో సాంఘికంగా కొన్ని దుర్గుణాలు పొడసూపడం తప్పని సరి, వాటి నుంచి బయట పడే మార్గం లేదు' అనే నమ్మకం బలపడుతూంది.

తత్ఫలితంగా - ఎటు చూపినా అవినీతి తాండవం ఆడుతూంది. వంచకులూ, దొంగలూ జీవితంలో పైకి వస్తూ ఉండడం చూసి నిజాయితీ పరులు తికమక పడుతున్నారు. నీతి, నియమాలకు తిలోదకా లిచ్చిన వారిలో అవినీతి మార్గం అనుసరించడం కంటె గత్యంతరం లేదనే నమ్మకం దృఢం అవుతూంది. పైకి ఏ పనులను తాము నిరసిస్తూంటారో ఆచరణలో అవే పనులను చేయడానికి వెను కాడక పోవడం శోచనీయ మైన సంగతి. కుటుంబ సభ్యుల మధ్య ప్రేమానురాగాల కంటె లాభ నష్టాల లెక్కలే ఎక్కువ ప్రాధాన్యం వహిస్తున్నాయి. బాతాఖానీ, కాలక్షేపం కబుర్లూ, స్వార్థానికి ఉపయోగించే పరిచయాలూ స్నేహానికి పర్యాయ పదాలు అయాయి. విద్యార్థుల వ్యక్తిత్వాలను మలచ వలసిన ఉపాధ్యాయులకూ, తల్లిదండ్రులకూ మధ్య అఖాతాలు ఏర్పడుతున్నాయి.

---

## విదేశీ కంపెనీలలో ఇండియన్ ఉద్యోగులు

భారత పరిశ్రమల మంత్రిత్వ శాఖలో ఆర్థిక సలహాదారు జరిపిన ఒక సర్వే వల్ల 1978 లో ఇండియాలోని విదేశీ కంపెనీలలో 97.8 శాతం ఇండియన్ ఉద్యోగులు పని చేస్తున్నట్టు తేలింది. విదేశీ ఉద్యోగులలో 60 శాతం మంది రు. 7,000ల కంటె ఎక్కువ వేతనాలు తీస్తున్నారు. ఇండియన్ ఉద్యోగులలో 90 శాతం మందికి రు. 2,000 నుంచి రు. 5,000 దాకా మాత్రమే వేతనాలు ఉన్నాయి.

"ప్రపంచంలోని మేధావు లందరికన్న
ఒక మంచి హృదయం ఉన్న వ్యక్తి మిన్న!" —లిట్టన్

అయితే - తను నమ్మదగిన వాడు గాని, తనని పూర్తిగా నమ్మేవాడు గాని లేనంత నిస్సహాయ స్థితిలో నిజంగా మనిషి ఉన్నాడా? అంతగా నిరుత్సాహం చెందవలసిన పనిలేదు. మనిషి అంతరంగంలో ఆనందం ఊటలు ఎన్నడూ ఇంకిపోవు. కొందరపాటు నిర్ణయాలూ, పొరపాటు అభిప్రాయాలూ తాత్కాలికంగా వాటిని అణచి ఉంచడం మాత్రమే జరుగుతూంది.

పరస్పర సంభాషణలో రవ్వంత ఆప్యాయతా, తోటివారి అవసరాల విషయంలో ఇసుమంత ఆసక్తి జీవితాన్ని సౌందర్యమయం చేస్తాయి. అలాంటి నడవడిక వల్ల కలిగే తృప్తే, ఆనందమే దానికి తగిన ప్రతిఫలం. మార్గం ఎంచుకోవాలే గాని, మరుక్షణమే ఫలితం కనిపిస్తుంది. మానవ జాతి చరిత్రలో మహామహు లందరి జీవితాలూ సత్ ప్రవర్తన వల్ల కలిగే లాభాలను వేనోళ్ళ చాటుతున్నాయి. తగిన వాతావరణం కల్పించి, మాటలలో చెప్పే ధర్మాలను చేతలలో ఆచరించ గలిగేట్టు పరస్పరం సహాయం చేసుకుంటే మానవుని హృదయంలో తాత్కాలికంగా అడుగంటిన సుగంధం తిరిగి గుబాళిస్తుంది!

ప్రేమ, నిగ్రహం, స్వార్థత్యాగం ఆచరించేందుకే ఉద్దేశింపబడ్డాయి. వాటివల్ల మనిషికి కలిగే ఆనందం మరే విధంగానూ లభ్యం కాదు. మనశ్శాంతిని సాధించడానికి వీలైన ఈ రాచబాటను మనం గుర్తిస్తే వేరే ఎలాంటి ఉపదేశాలూ అవసరం లేదు.

సేవ, ప్రేమ, నిరాడంబరత, మర్యాద మొదలైన వాటిని వ్యక్తులు ముందుగా అలవరచుకుంటే క్రమంగా అవి సంఘ జీవితంలో వేరు తొక్కుకుని, భద్రత, శాంతి నెలకొనగలవు. మనలో ప్రతి ఒక్కరూ తీవ్రంగా ఆలోచించవలసిన అంశం ఇది!

('గ్రోయింగ్ మైండ్స్' నుంచి) ●

---

## సూర్యుడి గమనం




స్థావరంగా ఉన్నట్టు పైకి కనిపించినా సూర్యుడు కూడా పాలపుంత (Milky way galaxy) ను కేంద్రంగా చేసుకుని తన సౌర కుటుంబం అంతటితో 25 కోట్ల సంవత్సరాల కొకసారి చుట్టి వస్తున్నాడు. 20 వేల కోట్ల నక్షత్రాలతో కూడిన కాంతి పుంజం అయిన ఈ పాలపుంతలో సూర్యుడు ఒక చిన్న నక్షత్రం. తన సౌరకుటుంబం అంతటితో, - అంటే మన భూమితో సహా - సూర్యుడు సెకనుకి 250 కి.మీ.ల దూరం చొప్పున కదులుతున్నాడు.

"సవ్యంగా, నిష్కల్మషంగా ఉన్నంత కాలం
జీవితంలో కోరిన వన్నీ లభిస్తాయి!" —సెనెకా

# ప్రపంచ వార్తలు

## ఇంధనంగా ప్రొద్దు తిరుగుడు పూవు నూనె:

బ్రెజిల్‌లోని ఒక బ్రిటిష్ సంస్థ జరిపిన ప్రయోగాలవల్ల డీసెల్ ఇంజన్‌కి ఇంధనంగా ప్రొద్దుతిరుగుడు పూవు నూనెను వాడవచ్చునని రుజువైంది. 80 శాతం డీసెల్ నూనెతో 20 శాతం ప్రొద్దుతిరుగుడు పూవు నూనెను కలిపి వారు డీసెల్ ఇంజన్‌ను నడిపించారు. ఒక ఎకరంలో పండే ప్రొద్దుతిరుగుడు పూల నుంచి వచ్చే నూనెతో 9 ఎకరాలు దున్నడానికి ట్రాక్టరును నడిపించవచ్చును.

* * *

## భూ కేంద్రానికి ఉత్తర ధ్రువం కంటె దక్షిణ ధ్రువం దగ్గిర:

భూమి వ్యాసార్ధం ఉత్తర ధ్రువం వైపు కంటె దక్షిణ ధ్రువం వైపు 40 మీ. లు తక్కువగా ఉన్నట్టు కృత్రిమ ఉపగ్రహాల నుంచి చేసిన కొలతల వల్ల తేలింది.

* * *

## గోబింద్ బిహారీ లాల్ అస్తమయం:

ప్రముఖ పత్రికా రచయిత, అమెరికాలో పులిట్జర్ ప్రైజ్ అందుకున్న తొలి భారతీయుడు గోబింద్ బిహారీలాల్ తన 92 వ ఏట ఇటీవల శాన్ ఫ్రాన్సిస్కోలో పరమపదించారు. అమెరికా నుంచి ఇండియా స్వాతంత్ర్య యోధులకు సహాయం అందజేసిన 'గదర్' పార్టీని ఆయనే స్థాపించారు.

* * *

## కృత్రిమ ఉపగ్రహాల వల్ల ఓడ ప్రమాదాల నిరోధం:

ప్రతి ఏడూ 400 ఓడలను ప్రమాదాలలో చిక్కుకోకుండా కృత్రిమ ఉపగ్రహాలు కాపాడుతున్నట్టు యూనెస్కో వారి ప్రకటన తెలుపుతూంది.

* * *

## బరువును మించిన ఆహారం



గండభేరుండ జాతికి చెందిన 'కార్మోరెంట్' అనే సముద్ర పక్షి 6 మొదలు 8 పౌనుల బరు వుంటుంది. కాని, అది రోజూ 15 పౌనుల చేపల దాకా అవలీలగా ఆరగించగలదు.

"విమర్శించే స్వేచ్ఛ ఇవ్వడమే ప్రజాస్వామ్యానికి గీటురాయి!" —బి.జి. దేవిడ్

## రష్యాలో జనాభా పెరుగుదల రేటు తగ్గు ముఖం:

ప్రస్తుతం రష్యా జనాభా 27 కోట్లు. 1980 జనవరి 1 నాటికి అది 26.45 కోట్లు. జనాభా పెరుగుదల రేటు తగ్గుముఖం పట్టడానికి యువ దంపతులు ఒకరి కంటె ఎక్కువ బిడ్డల్ని కనడానికి ఇష్టపడకపోవడం కారణం అంటున్నారు.

* * *

## 'టెలివిజన్' నిర్మాత అస్తమయం:

టెలివిజన్ కనిపెట్టిన వ్లాడిమిర్ జ్వోరికిన్ తన 93 వ ఏట ఇటీవల న్యూయార్క్‌లో మరణించారు. టెలివిజన్ నిర్మాణంలో మొదటి మెట్టు అయిన టెలివిజన్ కెమేరా ట్యూబ్ - ఐకనోస్కోప్ - నమూనాను ఈయనే తయారు చేశారు.

* * *

## ఇంగ్లీష్ ఛానల్ ఈదిన ఒంటి కాలి ఈజిప్షియన్:

21 ఏళ్ల వయస్సు గల ఈజిప్ట్‌లోని కెయిరో వాస్తవ్యుడు ఖలీద్ అహ్మద్ హసన్ తన ఒకే కాలుతో ఇటీవల ఇంగ్లండ్‌లోని డోవర్ వద్ద నుంచి ఫ్రాన్స్‌లోని కేప్‌గ్రిస్‌నెజ్ దాకా ఇంగ్లీష్ ఛానల్‌ని 12 గం. 39 ని. లలో ఈదారు.

## 'హులూలే' దీవిలో విమానాశ్రయం:

హిందూ మహాసముద్రంలోని మాల్దీవులలో ఒక చిన్న దీవి అయిన 'హులూలే'లో 2,800 మీటర్ల పొడవు గల 'రన్‌వే'తో ఒక జర్మన్ సంస్థ విమానాశ్రయం నిర్మించ బోతూంది. ఆ దీవి పొడుగు 100 కి.మీ.లు., వెడల్పు 35 కి.మీ.లు. ●

## విద్యా బోధనకు మైక్రో కంప్యూటర్లు



పాశ్చాత్య దేశాలలో మామూలు విద్యా బోధనకు ప్రతి విద్యార్థికి గంటకు రూ. 20 లు ఖర్చవుతుంది. ఇటీవల విద్యా బోధనలో మైక్రో కంప్యూటర్ల వాడకం వల్ల ఆ ఖర్చు రూ. 15 లకు తగ్గింది. ప్రస్తుతం సుమారు 100 సంస్థలు మైక్రో కంప్యూటర్లను తయారు చేస్తున్నాయి. విద్యాబోధనలో అన్ని స్థాయిల లోనూ వాటిని వాడుక చేస్తున్నారు.

---

"నమ్మకమైన వార్తలు ప్రకటించని దేశంలో స్వేచ్ఛకు పునాది ఉండదు." —హెరాల్డ్ జె. లాస్కి

# బహుమతి పొందిన వ్యాసం

# మనస్సును మించిన శత్రువు లేదు

(జనవరి 1983)

ఎన్. కృష్ణమాచార్యులు, డోన్.

బాహ్య ప్రపంచంలో కనపడే ధన, కనక, వస్తు, వాహనాలు తనకు ఆనందాన్ని చేకూరుస్తా యనే భ్రమను కలిగిస్తుంది మనస్సు. మనిషి తన మనస్సుకు బానిసయై వీటి సముపార్జన కోసం నిరంతరం పోరాటం సాగిస్తాడు. తన ఆశయానికి అవరోధాలుగా ఉన్న వాటిని తన శత్రువులుగా భావిస్తాడు. ఈ శత్రువులు మనుష్యులు కావచ్చు, జంతువులు మొదలైనవి కావచ్చు, లేదా గాలి, వాన లాంటి ప్రకృతి శక్తులు కావచ్చు. బాహ్య శత్రువుల నెన్నింటినో మానవుడు తన బుద్ధి బలంతో జయించ గలుగు తున్నాడు గాని, లోపలి శత్రువైన మనస్సుని జయించలేక పోతున్నాడు.

మనస్సు చంచలమైంది. బలాత్కారంగా హరించువట్టిది. అధిక బలం కలది. శ్రీకృష్ణుడే దీనిని త్రిప్పుట గాలిని త్రిప్పుట వలె అసాధ్య మని అన్నాడు. మానవునికి పరమ శత్రువై అతనిని మనస్సు ఎలా వేధిస్తున్నదీ క్లుప్తంగా గమనిద్దాము:

## ఇండియాలో మిక్కిలి పొడవైన రైల్వే టన్నెల్



సెంట్రల్ రైల్వేలో బొంబాయి - పూనె రైలు మార్గంలో 'మంకీ హిల్', 'ఖండాలా' స్టేషన్ల మధ్య 1982 జూలై 5 న ఒక కొత్త రైల్వే టన్నెల్‌కి ప్రారంభోత్సవం జరిగింది. ఇండియాలో మిక్కిలి పొడవైన ఈ టన్నెల్ పొడవు 2,100 మీటర్లు. 5 మలుపులతో కూడిన ఈ టన్నెల్ నిర్మాణానికి రూ. 1.25 కోట్లు ఖర్చయింది.

"బలవంతంగా శాంతిని సాధించలేము,
అర్థం చేసుకోడం వల్లనే దాన్ని సాధించ గలం!" —ఆల్బర్ట్ ఐన్‌స్టైన్

1. మనిషికి దేహమే ఆత్మ అనే భ్రాంతిని కలుగ చేసేది మనస్సే!

2. ఇంద్రియ సుఖాల మీద అతనికి వ్యామోహం కలిగించేది కూడా మనస్సే!

3. జన్మించిన ప్రతి జీవి మృత్యువును చేరుకోవలసిందే! అయినా మనిషికి తను శాశ్వతుణ్ణి అనే భ్రాంతిని కలిగిస్తుంది మనస్సు.

4. ఆధ్యాత్మిక జీవితాన్ని కలలోని మాటగా చేస్తుంది మనస్సు.

దేహం నశించినా, మనస్సు నశించదు. లింగ శరీరంలో కూడా మనస్సు జీవుణ్ణి వెన్నంటి ఉంటుంది. మనిషి ఆత్మ సాక్షాత్కారం పొందినపుడు మాత్రమే మనస్సు లయం పొందుతుంది. కులశేఖరుని వంటి మహాభక్తులు తమ మనస్సునే కానుకగా స్వీకరించి తమను కాపాడవలసిం దని భగవంతుణ్ణి ప్రార్థించారు.

* * *

కుమారి పింగళి రామలక్ష్మి,
దువ్వాడ (విశాఖ జిల్లా).

భగవంతుని నుండి వేరుబడి మానవుడు భూమిమీద జన్మించినపుడే 'కోరిక' అనే శక్తి అతనిని ఆవహించింది. 'కోరిక' అనే గుర్రానికి 'విచక్షణ' అనే కళ్ళెం వెయ్యాలి. కాని, నేటి కలియుగంలో కోరిక మనిషిని తన వశం చేసుకుంటూంది. వాస్తవంగా ఆలోచిస్తే మానవుడు మాధవుని అంశకు చెందిన వాడు. సముద్రంలోని నీరు ఆవిరియై, మేఘంగా మారి పర్వతాలమీద వర్షించి, నదులుగా ప్రవహించి, చివరికి మళ్ళీ ఆ సముద్రాన్నే చేరినట్టు మానవుడు కూడా ఎన్ని జన్మ లెత్తినా చివరికి భగవంతునిలో లీనం కాక తప్పదు. మనస్సు పురి విప్పిన మయూరమయితే కోరికలకూ, ఆకర్షణలకూ, కామ క్రోధాదులకూ మనిషి వశ మవుతాడు. మనస్సే మనిషిని దేవునికి దూరం చేస్తున్నది. అందు

---

## జీవితానికి లక్ష్యం



"మనం పుట్టినప్పుడు మనం ఏడుస్తూ ఉంటే మన బంధు మిత్రాదులు నవ్వుతూ చుట్టూ నిలబడతారు. జీవితంలో నుంచి మనం నిష్క్రమించేటప్పుడు మనం సంతృప్తిగా నవ్వుతూ ఉంటే మన బంధు మిత్రాదులు దుఃఖంతో తల్లడిల్లిపోయే రీతిగా జీవించడం మన జీవితాలకు లక్ష్యం కావాలి!"

—స్వామీ చిన్మయానంద

"ఈ ప్రపంచం మార్పును ద్వేషిస్తుంది:
కాని మార్పే అభివృద్ధికి ఏకైక సాధనం!' —ఛార్లెస్ ఎఫ్. కేటరింగ్

చేత మనిషికి మనస్సును మించిన శత్రువు మరొకటి లేదు. శత్రువు ఎప్పుడూ ఎదుటి వాడిని నాశనం చెయ్యడానికే చూస్తాడు. అలాగే మనస్సు కూడా మనిషిని ఇహ, పరాలకు దూరం చేస్తున్నది. అందువల్లనే "మనస్సును విచ్చలవిడిగా విడవకూడదు. తగిన కట్టుబాట్లలో ఉంచి దానిని మన అధీనంలో ఉండేట్టు చేసుకోవాలి!" అని గీతాచార్యులు (శ్రీకృష్ణ పరమాత్మ) బోధించారు.

* * *

జి. కె. అనంత సురేష్,

నాగార్జున సాగార్.

మనస్సును మానవునికి శత్రువుగా పరిగణించడం మూర్ఖత్వం, అవివేకం, అమాయకత్వం!

మనిషిని పక్షిలాగ ఆకాశంలో ఎగిరేట్టు చేసింది మనస్సు. రోగాలను, రోగ కారణాలను, రోగ నివారణలను కనుగొన్నది మనస్సు. ఈ నాడు మానవుడు ఇంత సుఖమయంగా జీవితం గడుపుతున్నాడంటే దానికి మూల కారణం మనస్సు. మనుష్యుని ప్రతి ప్రయత్నంలోనూ ప్రముఖ పాత్ర మనస్సుదే!

'మనసు లేని దేవుడు మనిషి కెందుకో మన సిచ్చాడు' అని కొందరు వాపోతూ ఉంటారు. 'మన సున్న మనిషికి సుఖము లేదంతే' అని విరహ గీతాలు పాడతారు మరి కొందరు. ఇటువంటి విచిత్ర మనస్కుల మనః ప్రవృత్తి తనకు బోధపడడం లేదు అంటూంది నా 'మనస్సు'. మనుష్యులను మనుష్యులుగా, మహీషులుగా తీర్చి దిద్దేది మనస్సు. అలాంటి మనస్సు మనిషికి ఏ నాటికీ శత్రువు కాదు. ●

## ముందుగా నేను మారాలి!




తోటి వారితో తన సంబంధాలలోనే కాక, తన ఆలోచనలలోనూ, అనుభూతులలోనూ, ఆచరణలోనూ పూర్తిగా మార్పు తెచ్చుకోడం ప్రతి వ్యక్తికీ సాధ్యమే!

నాలో కోపం నశించి, పోటీ ప్రవృత్తీ, దురాశా, అసూయా అంతరిస్తే అద్భుతంగా ఈ ప్రపంచం మీద నా ప్రభావం చూపించగలను. మన స్వార్థ ప్రవృత్తులతో, ద్వేషాలతో, మమకారాలతో మనమే ప్రపంచాన్ని ఈ నాటి అరాచక స్థితికి తెచ్చాము. అంతర్యమే ముక్కలు ముక్కలైపోతే ప్రపంచంతో మన అనుబంధాలూ ఛిన్నా భిన్నంగానే ఉంటాయి. మనలో ఏకరూపత సాధిస్తే ప్రపంచంతో మనకు ఉండే అనుబంధంలోనూ అద్భుతమైన మార్పు వస్తుంది. కాబట్టి ముందుగా నేను మారాలి! — జె. కృష్ణమూర్తి

"ఎంత ఎక్కువగా అధ్యయనం చేస్తే అంత ఎక్కువగా మన అజ్ఞానాన్ని మనం తెలుసుకుంటాం!" —వి.వి. షెల్లీ

# యోగాసనాలు

వ్యాయామవిద్యా ప్రవీణ శ్రీ జి. శ్రీనివాసరావు

## 6. విపరీత కరణి ముద్ర:



*VIPAREETHA KARANI MUDRA*

చేతులు శరీరం ప్రక్కనే అన్చి వెల్లకిలా పడుకోవాలి. మెల్లగా కాళ్ళు పైకి లేపుతూ నేల నుంచి 30° కోణం ఏర్పడేదాకా అలా పైకి ఎత్తాలి. పిరుదుల క్రింద చేతు లుంచి కాళ్ళను ఆ స్థితిలో నిలిపి ఉంచాలి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ధారాళంగా వదులుతూ, మోచేతుల మీద తలనూ, మొండేన్నీ పైకి లేపాలి. కాళ్ళకూ. మొండేనికీ మధ్య 90° లు ఉండేట్టు చూడాలి।

వ్యవధి : 15 సెకనులు మొదలు 3 నిముషాలు.

ప్రయోజనాలు: ఈ ఆసనం వల్ల థైరాయిడ్ గ్రంథి నుంచి వెలువడే స్రావాలు సక్రమంగా ఉంటాయి. లైంగిక వ్యాపారానికి సంబంధించిన నాడీ మండల భాగానికి ఇది బలం చేకూరుస్తుంది.

## 7. సర్వాం గాసనం:

చేతులు శరీరం ప్రక్కగా అన్చి వెల్లకిలా పడుకోవాలి. మెల్లగా కాళ్ళూ, నడుం,

---

## మీరైతే?

(ఫిబ్రవరి 1983)

"నేనే విద్యామంత్రి నయితే
మా అబ్బాయి చదువు ఫారిన్‌లోనే।"

—డి.ఎస్. జాన్సన్, పాలకొల్లు.

* * *

"ముఖ్యమంత్రి పదవికి ట్రై చేస్తా।"

—కె. లక్ష్మణరావు, ఒంగోలు.

* * *

"అగండాగండీ! నేనింకా వోటర్నే కానండీ।"

—బి. అనిల్ సుందర్‌కుమార్, విశాఖపట్టణం.

---

"ఒకరి జీవితాన్ని నాశనం చేసే అధికారం మనకు లేదు - ఒకరి జీవితాన్ని నిర్మించే శక్తి మనకు లేదు గనుక।" -గాంధీజీ

మెడం 90° లు ఉండేట్లు పైకి లేపాలి. చిత్రంలో లాగ గడ్డం రొమ్మును తాకుతూ ఉండాలి.




SARVANGASANA

వ్యవధి: 1 మొదలు 5 నిముషాలు.

ప్రయోజనాలు: ఎత్తు ఎదగడానికి, గుండెకు బలం చేకూర్చడానికి, జీవశక్తిని పెంపొందించి, కేంద్ర నాడీమండలానికి పుష్టి కలిగించడానికి ఈ ఆసనం తోడ్పడుతుంది. శుక్లనష్ట వ్యాధిని అరికడుతుంది. అజీర్తిని తొలగిస్తుంది. స్త్రీలకు ఇది మిక్కిలి ప్రశస్తం. స్త్రీ, పురుషులను నిత్య యౌవనులుగా నిలిపి ఉంచగల ఆసనం ఇది. ముష్టిమైథునం వంటి వాటివల్ల బరువు కోల్పోయిన వారికి తిరిగి బరువు పెంచడానికి ఈ ఆసనం తోడ్పడుతుంది. (సశేషం)

---

## రష్యాలో క్రీడాకారుల సంఖ్య

రష్యాలో ఈ నాడు 3,282 స్టేడియమ్‌ల లోనూ, 1,435 స్విమ్మింగ్‌పూల్ (ఈత కొలను) ల లోనూ, 66,000 ఇన్‌డోర్ ఆటల కేంద్రాలలోనూ చురుకుగా పాల్గొంటున్న క్రీడాకారుల సంఖ్య 5.5 కోట్లు.

## శరీర దార్ఢ్యం అవసరం!



మన యువకులకు "ముఖ్యంగా శరీర దార్ఢ్యం అవసరం. 'మతం' సంగతి ఆ తరువాతే! కాబట్టి నా యువక మిత్రులారా! శరీర దార్ఢ్యం సంపాదించండి - అదే మీకు నా సలహా! 'గీత' చదవడం కంటె 'ఫుట్‌బాల్' ఆడడం వల్ల మోక్షం మరింత దగ్గర అవుతుంది. ఇవి సాహసంతో కూడిన మాటలే! అయినా మీ మీద నాకు ఉన్న ప్రేమ వల్ల నే నీ మాటలు చెప్పక తప్పదు. కండ పుష్టి ఏర్పడితే 'గీత' మరింత బాగా మీకు అర్థమవుతుంది. నెత్తురులో జీవం ఉంటే కృష్ణ పరమాత్మ అద్భుత శక్తి, ఆయన అసాధారణ ప్రతిభ స్పష్టంగా బోధపడతాయి.

—స్వామి వివేకానంద

"కష్టపడి సంపాదించుకోవలసింది కీర్తి;
కష్టపడి నిలిపి ఉంచుకోవలసింది గౌరవం!" -హోవర్

# ఇండియాలో కాగితపు పరిశ్రమ

ఇండియాలో మొట్టమొదటి పేపరు మిల్లు 1832 లో ప. బెంగాల్‌లోని శ్రీరామ పూర్‌లో స్థాపించబడింది. ప్రస్తుతం దేశం అంతటా మొత్తం 13.94 లక్షల టన్నుల కాగితం ఉత్పాదించగల 106 పేపరు మిల్లులు పని చేస్తున్నాయి. కాగితపు పరిశ్రమలో ప్రపంచంలో ఇండియాది 20 వ స్థానం.



పంచవర్ష ప్రణాళికల అమలుకు ముందు కాగితపు పరిశ్రమ పూర్తిగా ప. బెంగాల్ రాష్ట్రానికే పరిమితమై ఉండేది. గత 30 సంవత్సరాలలోనూ ఈ పరిశ్రమ దేశం అంతటా వ్యాపించింది. అయితే - ప.బెంగాలు, మహారాష్ట్రం, ఆంధ్ర ప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలు ఈ పరిశ్రమలో మరింత ముందడుగు వేశాయి. కాగితపు మిల్లుల సంఖ్య మహా రాష్ట్రంలో ఎక్కువే అయినా - అవి ఎక్కువ ఉత్పాదక శక్తి గలవి కావు.

1951 నుంచి ఇప్పటికి కాగితపు మిల్లుల ఉత్పాదక శక్తి 10 రెట్లు పెరిగింది. సాలీనా పెరుగుదల రేటు 4 శాతం.

న్యూస్ ప్రింట్ తప్ప, ఇతర విధాలైన కాగితం, కార్డుబోర్డు ఉత్పత్తి చేసే మిల్లు లన్నీ ప్రజారంగంలోనే పని చేస్తున్నాయి. ప్రజా రంగంలో కూడా 8 పెద్ద పారిశ్రామిక సంస్థలు ఈ పరిశ్రమను పూర్తిగా కైవసం చేసుకున్నాయి.

మొట్టమొదటి న్యూస్ ప్రింట్ మిల్లు 1958 లో మధ్యప్రదేశ్‌లోని నేపా నగర్‌లో ప్రభుత్వ రంగంలో స్థాపించబడింది. 1970 మే నెలలో ప్రభుత్వం తక్కిన రకాల కాగితం, కాగితం గుజ్జు ఉత్పత్తి చేసే రంగంలో కూడా అడుగుపెట్టింది. "ది హిందూస్థాన్ పేపర్ కార్పొరేషన్ లిమిటెడ్" అనే సంస్థను స్థాపించి ప్రభుత్వపు కాగితం ఉత్పత్తి ప్రణాళికలు పూర్తి చేసే పనిని దానికి వప్పగించింది. నాగాలాండ్, కేరళ, నౌగంగ్, కాచార్‌లలో కొద్ది సంవత్సరాలలో ఈ ప్రణాళికను అమలు చేయడం ఆరంభం అవుతుంది. క్రొత్తగా ప్రారంభించిన 'కేరళ న్యూస్ ప్రింట్ ప్లాంటు' 70,000 టన్నుల న్యూస్ ప్రింట్‌నీ, 10,000 టన్నుల మేగజైన్‌ల కాగితాన్నీ ఉత్పత్తి చేయగలదు.

"జీవితం ఒక క్షేత్రం, దాని ఫలసాయం
మనం నాటే విత్తుల మీద ఆధారపడి ఉంటుంది" —బీచర్

# పోటీ

ఏప్రిల్ 1983

'విస్‌డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొనవచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకి తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీద అడ్రసు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలలో లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7 లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపను' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపనుతో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: ఏప్రిల్ 20, 1983. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు. తెలుగు "విస్‌డమ్", 9 దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

"నేను కలలు గనే ఇండియా" అనే అంశం మీద 300 మాటలు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## రాజధానులను చిన్న పట్టణాలకు మార్చాలి!



ప్రముఖ భవిష్యత్ శాస్త్ర నిపుణుడూ, బొంబాయిలోని నగరాభివృద్ధి సంస్థ డైరెక్టరూ అయిన డా. రశ్మి మయూర్ అభిప్రాయంలో రాజధానులను చిన్నసైజు పట్టణాలకు తరలించడం ఒక్కటే మహా నగరాలు మరీ పెరిగిపోకుండా కాపాడే ఉపాయం! మహా నగరాలకు ప్రజల వలస ఇప్పటి లెక్కలో కొనసాగే పక్షంలో 2,000 వ సం.రం నాటికి దేశంలోని 70 శాతం జనాభా మహా నగరాలలోనే ఉంటారు.

"చదువు రెండు రకాలు: ఒకటి బ్రతకడం నేర్పేది;
మరోటి బ్రతుకంటే ఏమిటో తెలిపేది!" —ఏడమ్స్

# క్విజ్

1. 'నానాజాతీయము'(multi-national) అని దేనిని అంటారు? 2. తొలి వేదం ఏది? 3. రష్యాలో విప్లవం తెచ్చిన ప్రధాన నాయకుడు ఎవరు? 4. భూమి సూర్యుని చుట్టూ తిరుగుతూం దని మొట్ట మొదట కని పెట్టిన శాస్త్రవేత్త ఎవరు? 5. ఇండియాలో హెక్టేరుకి పండే గోధుమ పంట ఏ రాష్ట్రంలో ఎక్కువ? 6. కంప్యూటరులో జ్ఞాపక శక్తిని వేటితో కొలుస్తారు? (ఏ) 'వోల్ట్'లు, (బి) 'ఆంపియర్'లు, (సి) 'ఓమ్'లు, (డి) 'బిట్' లు. 7. భారతీయ దర్శనాలలో 'న్యాయ' దర్శన కర్త ఎవరు? 8. ఉ.ప్రదేశ్ తరువాత లోక్ సభకు ఎక్కువ మంది ప్రతినిధులను పంపే రెండు రాష్ట్రాలు ఏవి? 9. ఐక్య రాజ్య సమితి (యూ.ఎన్.ఓ) కేంద్ర కార్య స్థానం ఎక్కడ ఉంది? 10. అజంతా గుహల ప్రత్యే కత ఏమిటి?

# పజిల్

ఆధారాలు: అడ్డం: 1. క్షుద్ర సాహిత్యాన్ని ప్రోత్సహించే 'తెలుగు నాడు', 4. హాసం, 4. నోరు పండించే ఆకు, 7. అన్ని రకాల కూరలతో కూడిన గంప, 10. ఆంధ్ర ప్రభలో ఊహాగానం చేసే రచయిత్రి, 12. 'ముక్తి నడుగు' (గజిబిజి) 13. 'పౌన గిందు'-ఇది ఏ ధాతువుకి ప్రేరణార్థకం, 14. తోక తెగి తల్ల కిందులైన బావుటా, 15. 'హర' - తిరగేస్తే, 16. 'బిన'తో కూడిన, 17. 'మహిని సాకి పాలించు దేవ!' - మొదటి మూడు మాటలూ సంక్షిప్తం చేస్తే 20. ఏరు, 21. 13 నిలువువల్ల, 22. 'పులిక్కిపడు' నుంచి వచ్చిన నామవాచకం, 23. కీడుకి వ్యతిరేకం, 24. లోకానికి అప్పుడు.

నిలువు: 1. చతుర్విధ అభినయాలలో ఒకటి, 2. మితమైన రక్తి, 3. అడవుల

---

## వస్తాదుల శక్తి ఉత్పాదన



ఒళ్ళు అలవకుండా కుర్చీలో కూర్చుని పని చేసే మామూలు ఉద్యోగి తన బరువులో ప్రతి కిలోగ్రాముకూ నిముషానికి 30 మి.లీ.ల ప్రాణవాయువు పీలుస్తూ, కేవలం 1,100 వాట్ల శక్తిని మాత్రమే ఉత్పాదన చేస్తాడు. ఒలింపిక్ క్రీడాకారులు నిముషానికి 80 మి.లీ.ల ప్రాణవాయువు పీలుస్తారు. ఒలింపిక్ క్రీడలలో బరువులు ఎత్తే వస్తాదు 2,400 వాట్ల శక్తిని ఉత్పాదన చేయగలడు.

---

"బంగారంలో ప్రతి సన్నని తీగకూ విలువ ఉన్నట్టే
జీవితంలో ప్రతి క్షణానికీ విలువ ఉంది" —మానస్

వల్ల ప్రధానంగా లభించేది, 4. పాండవులలో చివరి ఇద్దరిని వరుసగా పిలవండి, 6. 'మొగుడు'కి పీర గ్రాంథిక రూపం,



8. లగువు + బిగువు, 9. '—బాన' ఇదొక అగ్గి విప్పులాంటి మాట, 11. తగిన, 13. అలవాటులో చేసె తప్పు, 16. — + లక్ష = ఒకటింపావు లక్ష, 17. తోక తెగిన మరపాప, 18. అరవ వారి భోజనం, 19. విభుడు, భర్త, 21. బొడ్డు, నాభి.

## తెలివికి పరీక్ష

1. మొదట, చివర 'శ్రీ' ఉన్న తెలుగు మహాకవి ఎవరు? 2. బుధుడు, బృహస్పతి, ఇంద్రుడు, గౌతముడు, కుజుడు - ఈ జాబితాలో ఇమడని వ్యక్తిని గుర్తించండి? 3. 3, 7, 16, 35 — ఈ వరుసలో తరువాతి సంఖ్య ఏది? 4. "నేను గదిలోకి వెళ్ళేసరికి —తప్ప ఎవరూ లేరు" (ఏ) మేము, (బి) మీరు, (సి) ఆమె, (డి) నేను. వీటిలో సరియైన మాటతో ఖాళీని పూరించండి, 5. లండన్, రోమ్, లిజ్బన్, నైరోబీ, బాన్ - వీటిలో యూరపియన్ నగరం కానిది ఏది? 6. ఇంగ్లీషు అక్షరాలలో ఒక పానీయాన్ని గుర్తించగలరా? 7. పళ్ళు ఉన్నా తినలేనిది ఏది? 8. సముద్రం అని అర్థం వచ్చే నది ఏది? 9. తిక్కన గారిచేత భారతం వ్రాయించిన రాజు ఎవరు? 10. కంచెర్ల గోపన్న మేనమామలు ఎవరు?

## 'పేరోడోంటోసిస్' అనే పళ్ళ జబ్బును గుర్తించే పరికరం



సీమెన్స్ కంపెనీ (ప.జర్మనీ) తయారు చేసిన ఒక కొత్త పరికరంతో దంత వైద్యులు ఇప్పుడు 'పేరోడోంటోసిస్' అనే పళ్ళ జబ్బుని చాలా ముందుగానూ, సులువుగానూ గుర్తించ గలుగుతున్నారు. వాచిన పళ్ళ సందులో ఒక అదుడు కాగితం పెటి అది అక్కడి ద్రవాన్ని పీల్చిన తర్వాత ఆ కాగితాన్ని ఈ పరికరంలో అమర్చితే 20 సెకనులలో ఆ వ్యాధి వివరాలన్నీ ఈ పరికరం తెలియజేస్తుంది.

"వెలుతురుకి నీడ సహజం; జీవితంలో తప్పులు సహజం!" —జాంగర్

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి:

1. మహతి: (ఏ) గొప్ప స్త్రీ (బి) 100 తంతులు గల వీణ (సి) పర్వతం (డి) స్త్రీ లింగం.

2. దీధితి: (ఏ) దధీచి (బి) అదితి (సి) వెలుగు (డి) హారతి.

3. మారుతి: (ఏ) గాలి (బి) వానరం (సి) భీముడు (డి) హనుమంతుడు.

4. కనిష్ఠిక: (ఏ) చిటికెన వేలు (బి) కడగొట్టు కొడుకు (సి) అత్యల్పము (డి) బాలిక.

5. ఆశ్లేష: (ఏ) కౌగలింత (బి) పరిరంభం (సి) 9 వ నక్షత్రం (డి) 16 వ నక్షత్రం.

6. సారసము: (ఏ) బెగ్గురు పక్షి (బి) స్వారస్యం (సి) ఒక నది (డి) పద్మం.

7. క్షితిజము: (ఏ) చెట్టు (బి) గాయము (సి) భూమ్యాకాశాలు కలిసే చోటు (డి) జానకి.

8. పరుసవేది: (ఏ) వేద పండితుడు (బి) పౌరుషం గలవాడు (సి) పరుషంగా మాట్లాడే వాడు (డి) స్పర్శమణి.

9. నీరాజనం: (ఏ) తామర పువ్వు (బి) హారతి (సి) రాజ్యభ్రంశము (డి) నివాళి.

10. కాననము: (ఏ) చూడలేనిది (బి) నేర్పు (సి) అడవి, (డి) వికారమైన ముఖము.

## అదృష్ట పాఠకుడు

పోస్టుకార్డు సైజులో మీ ఫొటోతో సహా సంగ్రహంగా మీ 'పరిచయం' వ్రాసి పంపండి. చీట్లు తీసి నిర్ణయించే అదృష్ట పాఠకుని/పాఠకురాలి ఫొటో, పరిచయం 'విస్డమ్'లో ప్రచురిస్తాం. రు. 10 లు ఖరీదు చేసే ఒక పుస్తకం కూడా ఆ అదృష్ట పాఠకుడికి, లేదా పాఠకురాలికి పంపుతాం. ఫొటో వెనుక విధిగా అడ్రస్సు వ్రాయాలి. ఫొటోలు త్రిప్పి పంపబడవు.

## 46,000 ఏళ్లనాటి నియాండర్తల్ మనిషి



ఉత్తర ఇరాక్‌లోని షానిదార్ గుహలో 46,000 ఏళ్ళ క్రితం జీవించిన నియాండర్తల్ మనిషి ఎలా ఉండే వాడో పై చిత్రంలో చూడవచ్చును. ఆ గుహలో దొరికిన ఒక ప్రాచీన కాలపు పుర్రె ఆధారంగా జే మెట క్నీస్ అనే చిత్రకారుడు గీసిన ఊహా చిత్రం ఇది.

"అభ్యాసం వల్ల విద్య, గుణం వల్ల మానవుడు,
దానం వల్ల ధనం, సాధు స్వభావం వల్ల అధికారం రాణిస్తాయి." —చాణక్యుడు

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక సూచించండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి, రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 లు బహుమతి.

## మీ ప్రశ్నలు

వ్యక్తిగత మైనవి కాకుండా అందరికీ ఆసక్తి కలిగించే ప్రశ్నలు అడగండి.

ప్రముఖ సినీ నటి, కథా రచయిత్రి

శ్రీమతి పి. భానుమతీ రామకృష్ణ

జవాబు లిస్తారు.

విస్డమ్

పోటీల కూపను

ఏప్రిల్ 1983

## ఇండియాలో ఏనుగుల సంఖ్య

ప్రస్తుతం ఇండియాలో సుమారు 16,400 ఏనుగులు ఉన్నట్టు అంచనా!

## మీరైతే.....

"కాలేజి ప్రిన్సిపాల్ అయితే?" మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పోటీ





8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి వాటికి వర్తించేట్టు చమత్కారమైన, లేదా ఆలోచన రేకెత్తించే శీర్షిక సూచించండి.

"స్వేచ్ఛకు అదుపు ఉంది కాని, పరిహద్దులు లేవు!" —లాయిడ్ జార్

# సంపూర్ణమైన సుఖం సాధించడం ఎలా?

శ్రీ టి. చెంగల్వరాయన్



[శ్రీ చెంగల్వరాయన్ (జననం: 1908 ఆగస్టు 13) 1929 లో న్యాయశాస్త్ర పట్టభద్రులయారు. 1933 లో కాంగ్రెసు ఉద్యమంలో చేరి పని చేశారు. 1939 నాటి వ్యక్తి సత్యాగ్రహంలో జైలుకు వెళ్ళారు. 1948 లో ప్లీడరుగా ప్రాక్టీసు ఆరంభించారు. 1952 లో మద్రాసు మేయరు అయారు. 1964 నుంచి 1972 వరకు రాజ్యసభ సభ్యులు. మంచి వక్త. మద్రాసు నగర సాంఘిక, సాంస్కృతిక జీవనానికి పుష్టి చేకూర్చిన ప్రముఖులలో ఒకరు.]

అనాదిగా మనిషి సుఖంకోసం తాపత్రయ పడుతున్నాడు. కాని, సంపూర్ణ మైన, శాశ్వతమైన సుఖం సాధించలేక పోతున్నాడు. సుఖం క్షణికమైంది అనీ, ఆనందం నిత్యమైంది అనీ మత గ్రంథాలు చెబుతాయి. మనిషి పొందే లౌకిక సుఖాలు తాత్కాలిక సంతృప్తిని కలిగించవచ్చు గాని, నిత్యమైన సంతుష్టిని కలిగించ లేవు. సుఖాలు ఇంద్రియ సంబంధ మైనవి. క్షణికాలైన ఆ సుఖాలనే తన అజ్ఞానం వల్ల మనిషి జీవిత పరమార్థం అనుకుంటున్నాడు. ప్రతి సుఖాన్నీ వెన్నంటి ఒక దుఃఖం ఉంటుంది. ఆ దుఃఖం మనిషికి ఆ సుఖంమీద రోత పుట్టిస్తుంది. అయినా తిరిగి తిరిగి అలాంటి సుఖాల కోసమే మనిషి అర్రులు చాస్తున్నాడు. ఆ విధంగా సుఖ దుఃఖాల విష వలయం నుంచి బయట పడలేక మనిషి గిలగిల కొట్టుకుంటున్నాడు.

'ఆనందం' ఉదాత్త మైంది. మనకు

## మిక్కిలి పొడవైన చేతి గోళ్లు

'పూనె' నగరానికి చెందిన శ్రీధర్ చిల్లాల్ చేతి గోళ్ళు ప్రపంచంలో అందరి గోళ్ళ కంటె మిక్కిలి పొడుగైనవి. 1981 మార్చి 22 నాటికి ఆయన ఎడమ చేతికి ఉన్న 5 గోళ్ళ మొత్తం పొడవు 108½ అం.లు. 1952 నుంచి ఆయన ఇలా గోళ్ళు పెంచుతున్నారు.

సుఖాన్ని చేకూర్చే బాహ్య వస్తువులమీద ఇది ఆధారపడి ఉండదు. మనం సాధించిన మంచి పనుల వల్ల మన ఆత్మలో కలిగే పారవశ్యమే ఆనందం. పరుల సుఖ దుఃఖాలను తనవిగా భావించడం వల్ల కలుగుతుంది ఆనందం. పిల్లలు వృద్ధిలోకి వచ్చి, పేరు, ప్రతిష్ఠలు ఆర్జిస్తే ఆనందపడతాం. ఎక్కడ ఏ మంచి జరిగినా, ఏ అభివృద్ధి కనిపించినా మనం ఆనంద పడతాం!

ఆనందంలో అనేక భేదాలు ఉన్నాయి. మంచి సాహిత్యగ్రంథం ఏదైనా చదివినప్పుడు మనకు కలిగేదీ. పిల్లలకు చదువు చెప్పేటప్పుడు కలిగేదీ మానసికమైన ఆనందం. మనం నీతిగా నడుచుకోడం వల్ల కలిగే ఆనందం 'నైతిక' (moral) మైన ఆనందం. మంచిగా బ్రదకడమే ఒక ఆనందం! మంచి చెయ్యడమే ఒక ఆనందం! 'సత్యం' ఆనందాన్ని చేకూరుస్తుంది; 'ప్రేమ' ఆ ఆనందానికి పుష్టి నిస్తుంది; 'సేవ' దాన్ని శాశ్వతం చేస్తుంది; 'ధ్యానం' దానిని నిర్మలం చేస్తుంది!

'ఆనందం' సాధించడం ఎలాగో చెప్పడం ఆనందాన్ని అభివర్ణించినంత తేలిక కాదు. జీవితంలో మనిషి దృక్పథంవల్ల, అతని ప్రవృత్తులవల్ల ఆనందం లభ్యం అవుతుంది. క్రయంగా గాని, అద్దెకు గాని, కానుకగా గాని లభించే భౌతికమైన ఆసులాగ ఆనందాన్ని మనం సంపాదించలేము. స్వయంకృషివల్లా, ...తి వల్లా మాత్రమే ఆనందాన్ని సాధించగలము.

పరోపకారం ఆనందానికి రాచ బాట! ధూళిలో పొర్లాడుతూ, ఆకలితో, వ్యాధులతో అతి దీనంగా జీవించేవా రెందరో నిత్యం మనకు కనిపిస్తారు. వా రలా నికృష్టంగా బ్రతుకుతూ ఉన్నంతకాలం మనం ఎలా ఆనందం పొందగలం? గడప దగ్గిర 'అమ్మా! మాదా కవళం' అంటూ పసిపిల్లవాడు అరుస్తూ ఉంటే మన నోటికి తిండి ఎలా రుచిస్తుంది? రోజుల తరబడి పస్తులతో బీదా, బిక్కీ అల

## అదృష్ట పాఠకుడు

(ఫిబ్రవరి 1983)



పసుమర్తి పద్మనాభన్, బి. కాం., S/o. పి. శివరామయ్య, ఫార్మర్స్ సర్వీస్ కో-ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్ ఎదురుగా, శ్రీహరి కోట రోడ్, సూళ్లూరుపేట - 524 121. హాబీలు: కవితలు చదవడం, వ్రాయడం, క్రికెట్, మంచి పుస్తకాలు చదవడం.

"మహాబలశాలి అయినప్పటికీ, కోమల హృదయం కలవాడే నిజమయిన ధీరుడు!" —వివేకానంద స్వామి

మటిస్తూంటే మనం ఆనందంగా ఎలా జీవించ గలం?-

ఒక వేపున ఎన్నో అంతస్తులు ఉన్న దివ్య సౌధాలు! మరో వేపున చిల్లులు పడ్డ కప్పులతో మట్టి గుడిసెలు! ఒకవేపున పంచ భక్ష్య పరమాన్నాలతో విందులు! మరో వేపున విందుల తాలూకు ఎంగిలాకులలో మిగిలిన పదార్థాల కోసం కాట్లాడుకునే బక్కచిక్కిన కుర్ర సన్నాసులు! ఒకవేపున ఎయిర్ కండిషన్డ్ కారులో తమ సీమకుక్కతో సహా ఒంటరిగా వాహ్యాళి బయలుదేరిన కోటీశ్వరుడు! మరో వేపున ఆయాస పడుతూ చెమటలు కక్కుతూ, భర్తీగా ఉన్న చేతిబండి లాక్కుపోతున్న కూలివాడు! ఈ పరిస్థితిలో మనకు ఆనందం ఎలా సాధ్యం?

దారుణమైన, విషాద భరితమైన మూడు దృశ్యాలు చూశాడు బుద్ధుడు. వెంటనే నిజమైన ఆనందం కోసం అన్వేషిస్తూ ఆయన బయలుదేరాడు. సేవాభావంలోనే, ఆపదలో ఉన్న వారి కన్నీరు తుడవడంలోనే ఆనందం ఉందని ఆయన కనుగొన్నారు.

మన సంఘం పట్ల మన కొక బాధ్యత ఉంది. ఆధ్యాత్మిక చింతన ఒక విధంగా స్వార్థంతో కూడింది. నిజానికి - శోకమూర్తిలాగ ఉన్న ఒక తల్లి ముఖంలో సంతోషపు కాంతి ప్రసరింపజేయ గలిగితే, అల్లరి చిల్లరగా తిరుగుతున్న ఒక కుర్రవాడికి విద్యాబుద్ధులు కరపి అతణ్ణి ఉత్తమ పౌరుడుగా మలచగలిగితే అంతకంటె నిజమైన ఆనందం ఏ ముంటుంది?

మనవల్ల సహాయం పొందిన ఒక వ్యక్తి జీవితంలో పైకి వచ్చి ఆ సంగతి మనం పూర్తిగా మరచిపోయిన తరువాత ఎన్నో ఏళ్ళకు ఎప్పుడో ఎక్కడో తటస్థపడి "మీ చలువ వల్లనే నేనింతవాణ్ణి అయాను" అన్నప్పుడు మనకు ఎంత ఆనందం కలుగుతుంది? ఇతరులకు ఆనందం చేకూర్చడంలోనే మన ఆనందం ఇమిడి ఉంది. మన కుటుంబం, మన సంఘం, మన జాతి, మన ఈ ప్రపంచం అంతా సుఖంగా, ఆనందంగా ఉండాలి. అదే మనకు నిజమైన ఆనందం!

మానవసేవకు జీవితాన్ని అంకితం చేసుకోడం వల్లనే సర్వ సంపూర్ణమైన సుఖం, సంతోషం, ఆనందం మనం మన జీవితాలలో సాధించగలం!

"సర్వేజనాః సుఖినో భవన్తు!" ●

## ప్రపంచ సైకిల్ పందేలలో గెలుపొందిన కవలలు



ప్రపంచ సైకిల్ పందేలలో స్త్రీల విభాగంలో ప. జర్మనీకి చెందిన రూత్, ఉటే జిస్త్రా అనే కవల అప్పచెల్లెళ్ళు ప్రపంచ ఛాంపియన్ షిప్ గెలుచుకున్నారు.

"వివేక శూన్యుడైన మిత్రుడు వివేకవంతుడైన శత్రువుకంటె ప్రమాదకారి!" - షేక్స్పియర్

# ఆందోళనను అరికట్టాలంటే..!

డా. క్లైవ్ డి. హర్లీ

నిజం కాని, ఊహా కల్పితం కాని అయిన ఒక ఆపద నుంచి మనస్సును మళ్ళించుకో లేకపోవడం వల్ల ఆందోళన కలుగుతుంది. పదే పదే ఆ ఆపదని గురించే ఆలోచిస్తూ కూచుంటాం. ఏ పని చేస్తున్నా అదే మన మనస్సులో ఆందోళన కలిగిస్తూ ఉంటుంది.




మన శక్తి నంతా నిరర్థకం చేసుకుంటూ గానుగెద్దు లాగ ఒక విషవలయంలో పడి తిరుగుతూ ఉంటాం.

ఈ విష వలయాన్ని ఛేదించా లంటే అందుకు ఎవరి మట్టుకు వారే నడుం కట్టుకోవాలి. ఏదో అదృష్టం కలిసి వస్తుం దని గాని, ఎవరి దగ్గిర నుంచో అనుకోకుండా అద్భుతమైన సలహా, సహకారం లభిస్తా యని గాని ఎదురుచూడకూడదు. ఏ మందులూ, మాకులూ మనకు ఆందోళన నుంచి విముక్తి కలిగించ లేవు. ఎవరికి వారే ఆ విముక్తిని సాధించుకోవాలి. సమస్య మన మనస్సులో ఉంది; మనస్సుతోనే దాన్ని పరిష్కరించుకోవాలి!

అసలు మనం ఎందుకు ఆందోళన పడుతున్నాం? మన సమస్య ఏమిటో మనకు మనం చేతనైనంత స్పష్టంగా చెప్పుకోవాలి. సమస్య ఏమిటో కచ్చితంగా మనకు తెలియనంత వరకూ అస్పష్ట రూపంలో అది మనకు మరింత ఆందోళన కలిగిస్తుంది.

ఆందోళన అలవాటైన వారు తరుచు అనే మాట - "ఏ పని మీదా నేను మనస్సును నిలుపలేక పోతున్నా నండీ!" అని. బహుశః

## ప్రముఖ క్రీడాకారుని దుస్థితి

వెనుక ఒలింపిక్ క్రీడలలోనూ, ఆసియా క్రీడలలోనూ పాల్గొని రజత పతకం పొందిన సుప్రసిద్ధ భారతీయ క్రీడాకారుడు సోహన్ సింగ్ కుటుంబం గడిచే పరిస్థితి లేక ఇటీవల తన రజత పతకం అమ్ముకున్నాడు. జలంధర్‌లో ఒక బాలికల పాఠశాలలో పనిచేస్తున్న సోహన్‌సింగ్‌కు పంజాబు ప్రభుత్వ క్రీడల శాఖ నుంచి అనేక మాసాలుగా జీతం ముట్టడం లేదు.

"సజ్జనుడి సంపాదన మేఘం లాగ
తిరిగి దానం చెయ్యడానికే!" —కాళిదాసు

అది నిజమే కావచ్చు. కాని, తమ పూర్తి భావనా శక్తినీ, ఏకాగ్రతనీ వాళ్ళు తమ ఆందోళన మీదే కేంద్రీకరిస్తారు. "ఆ ఏకాగ్ర గ్రతనీ, భావనా శక్తినీ ఉపయోగకరమైన ఇతర విషయాల వైపు వారు మళ్ళించ గలిగితే జీవితంలో వారు ఎంతో సాధించ గలరు."

ఆందోళన చెందే వారు తాము చాలా దారుణ పరిస్థితులలో ఉన్నట్టు భావించు కుంటూ ఉంటారు. ఏదో ఆపద ముంచుకు వస్తుందనే ఊహ నిరంతరం వారిని వేధిస్తూ ఉంటుంది. అది కేవలం వారి ఊహే అయినా, నిజంగా ఆ ఆపద సంభవిస్తే ఎంతగా బాధ పడతారో, అంత బాధనీ వారు అనుభవిస్తారు. దానిని గురించే ఆలోచిస్తూ ఉండడంతో వారి ఆందోళన మరింత తీవ్రం అవుతుంది. అలాంటి వారికి "మీరు ఆందోళన చెందకండి!" అని చెప్పి ప్రయోజనం లేదు. ఆందోళన అనే విష వలయాన్ని ఛేదించడానికి ఒకే ఒక ఉపాయం - బాధాకరమైన ఆలోచనల స్థానంలో సంతోషకరమైన ఆలోచనలను ప్రవేశపెట్టడం. ఆ సంతోషకరమైన ఆలోచన తగినంత బలమైంది కావాలి. బలమైన ఆలోచన తక్కిన ఆలోచనల్ని బయటికి నెట్టివేస్తుంది.

నాకో కథ గుర్తొస్తూంది. వెనుకటికి ఒక సన్న్యాసి ఒక ఊరు వచ్చాడు. బంగారం తయారు చేసే కీలకం తనకు తెలుసన్నాడు. కొన్ని వస్తువులు ఒక కుండలో వేసి వాటిని కలియ బెడుతూ కూడుంటే కొంత సేపటికి అవి బంగారంగా మారుతా యట. బంగారం కావాలని ఆయన చుట్టూ మూగిన గ్రామస్థుల దగ్గర నుంచి ముందుగానే ఆయన తన ఫీజు వసూలు చేసుకున్నాడు. తరువాత గ్రామస్థు లందరి తరఫున గ్రామ పెద్దకి కలియ బెట్టే పని పురమాయించాడు. సన్న్యాసి గనుక స్వయంగా తాను ఆ పని ఎన్నడూ చెయ్యా డట! అయితే కలియ బెట్టడానికి సిద్ధపడిన గ్రామ పెద్దకు ఆయన ఒక షరతు విధించాడు.

## గొంతుతో సన్నాయి పాట



తిరునెల్వేలిలోని 'శంకర్ పోలిటెక్నిక్ ఇన్‌స్టిట్యూట్'లో జూనియర్ టెక్నికల్ ఆఫీసరుగా పనిచేస్తున్న 40 ఏళ్ళ వయస్సు గల కుదంతాయ్ ఎస్. జయరామన్ వాద్యం అవసరం లేకుండానే చేతి వ్రేళ్ళను నోటికి అడ్డంగా పెట్టుకొని సన్నాయి పాట వినిపిస్తున్నాడు. గత మూడేళ్ళుగా ఆయన ఫిడేలు, హార్మోనియం, మృదంగం వంటి పక్కవాద్యాలతో సహా వివిధ స్థలాలలో ఈ విధమైన సన్నాయి పాట కచేరీలు చేస్తూ వేలాది మంది శ్రోతలను రంజింప చేస్తున్నారు.

"బుద్ధిహీనులు గట్టిగా బల్లగుద్ది మాట్లాడుతారు,
బుద్ధిమంతులు నోరు మెదపరు. అదే ప్రపంచానికి వచ్చిన అరిష్టం!" -కోల్టన్

కలియ బెడుతున్న సమయంలో పండుకోతి రూపం ఏ మాత్రం అతని మనస్సులోకి వచ్చినా బంగారం తయారు కాదు ఆ మాట విన్న మరుక్షణం నించీ ఆ గ్రామ పెద్దా, ఇతర గ్రామస్థులూ ఎంత ప్రయత్నించినా పండుకోతి రూపాన్ని మరచి పోవడం వారికి సాధ్యం కాలేదు. వారు అలా సతమతమవుతూ ఉండగా మెల్లిగా ఆ సన్న్యాసి జారుకున్నాడు.

అందుచేత - ఆందోళన నుంచి విముక్తి చెందా లంటే ఆ విషయం కంటె బలమైన, సంతోకరమైన మరో ఆలోచన మీదికి మనస్సును మళ్ళించాలి. ఆ ఆలోచనను ఎవ రికి వారే ఎంచుకోడం ఉత్తమం. తాము చేసిన సంతోషకరమైన యాత్రను గురించో, చూసిన అందమైన దృశ్యాన్ని గురించో, తమకు జరిగిన గౌరవాలను గురించో ఆలో చించవచ్చును.

ఫలితం మీద కంటె ప్రయత్నం మీదే ప్రధానంగా దృష్టి ఉంచాలి. భవిష్యత్తులో కలుగబోయే ఫలితం గురించే సాధారణంగా మనం ఆందోళన చెందుతూ ఉంటాం. గత కాలంలో చేసిన కర్మలకు ఫలితంగా భవి ష్యత్తు రూపొందుతుంది. దీనిని గురించి ఆందోళన చెంది ప్రయోజనం లేదు.

విలియమ్ జేమ్స్ అనే సుప్రసిద్ధ మన శ్శాస్త్రవేత్త అంటాడు: "మనకు చాలా ఆలోచనలు ఉండి, వాటిని అమలు చెయ్యా లనే బలమైన సంకల్పం ఉంటే 'ఎప్పుడూ వాటిని గురించే మధనపడుతూ ఉండడం' అనే అలవాటును మనం పోగొట్టుకోవాలి. వాటి ఫలితాలను గురించి స్వార్థ దృష్టితో ఆలోచించడం మానుకోవాలి."

'ఈ క్షణం మనం ఏమి చెయ్యాలి'? అని ఆలోచించాలే గాని, దాని ఫలితాన్ని గురించిన ఆలోచన మనస్సులోకి రానీయకూడదు. ప్రస్తుత కర్తవ్యం మీద మనస్సు నిలపడం వల్ల గతాన్ని గురించీ, భవిష్యత్తును గురించీ ఆందోళన పడడం మానివేస్తాం. ఆందోళనతో కంటె ఆందోళన లేకుండా చేసే పనుల వల్ల భవిష్యత్తులో మంచి ఫలితాలు సాధించ గలం. ●

## మిక్కిలి పెద్ద జెనరేటర్



అమెరికా లోని ఒక ఫార్మస్యూటికల్ కంపెనీ కోసం 'సీమెన్స్ బెర్లిన్ డైనమో ఫాక్టరీ' వారు నిర్మించిన పై చిత్రంలోని 30-ఎం. వి. ఏ. డీసెల్ జెనరేటర్ ప్రపంచంలో మిక్కిలి పెద్ద జెనరేటర్‌లలో ఒకటి. 8.5 మీటర్ల ఎత్తూ, 11 మీ.ల వెడల్పూ, 226 టన్నుల బరువూ ఉన్న ఈ జెనరేటర్ విద్యు చ్ఛక్తిని ఉత్పాదించడమే కాక, ఎగ్జాస్ట్ గాస్ నుంచీ, వేడి తగ్గడానికి వాడే నీటి నుంచీ ఉష్ణ తను కూడా రాబట్టగలదు.

"మానవుని రోగాలలో చికిత్సకు లొంగనిది 'అహంభావం.'" —హెన్రీ బీచర్

# పోటీలు (ఫలితాలు)

(ఫిబ్రవరి 1983)

వ్యాసం: మొదటి బహుమతి: పి.ఆర్. మందేశ్వర రావు, రాజమండ్రి: రెండవ బహుమతి: కె. శ్రీనివాసులు, తనకల్లు (అనంతపురం జిల్లా): మూడవ బహుమతి: వై. భాస్కర్, గజ్వేల్ (మెదక్ జిల్లా).

క్విజ్: జవాబులు: 1. మాస్కో, 2. జిరాఫీ, 3. 65వ ఏట, 4. ఇంగ్లండు, 5. వైటమిన్-డి, 6. హిందూ మహాసముద్రంలో, 7. పావురం, 8. కామశాస్త్రం, 9. అస్సాం, 10. సీసం.

విజేతలు: మొదటి బహుమతి: కె. దేవేందర్ రెడ్డి, హన్మకొండ (వరంగల్ జిల్లా): రెండవ బహుమతి: పి. కృష్ణ, నవైల్ (నల్గొండ జిల్లా): మూడవ బహుమతి: శ్రీమతి వి. సుజాత, తిరుపతి.

పజిల్: జవాబులు: అడ్డం: 1. శ్రీరామ, 4. తారక, 6. జయము, 8 జామ, 9. ఐరావని, 10. తరగాలి, 12. న జ భ, 13. ఏకసంథా, 14. పోతాము, 16. రామారావు, 18. మసక, 20. చెలగాట, 21. ఎన్నికలు, 22. యము, 23. నూకల, 24. మితిని, 25. తోమట.

నిలువు: 2. రాజరాజ, 3. మయసభ, 4. తామరసం, 5. కదలి, 7. ముని, 8. జాతకము, 9. ఐనచో, 11. గాథా, 13. ఏతావు, 14. పోరాటము, 15. తోకలు, 16. రాల, 17. మా గాయని, 18. మన్నికతో, 19. సకలము, 20. చెలిమి, 21. ఎ నూ.

విజేతలు: మొదటి బహుమతి: ఎమ్. ఆర్. లక్ష్మణన్, విజయనగరం. రెండవ

## మేటి బాల చిత్రకారులు



'వోలో డార్స్కీ ట్రాం డిపో' (రష్యా)కి చెందిన 'లెనిన్ గ్రాడ్ కిండర్ గార్డెన్ నెం. 29' లోని 9 మంది విద్యార్థులు 'అంతర్జాతీయ పిల్లల డ్రాయింగ్ పోటీల'లో గెలుపొంది గౌరవ పతకాలూ, డిప్లొమాలూ అందుకున్నారు. వివిధ పోటీలలో ఇప్పటికి వారు సువర్ణ, రజత, కాంస్య పతకాలు మొత్తం 431 దాకా గెలుచుకున్నారు.

"యౌవనం వెల్లువ లాంటిది: ఆనకట్ట కట్టి ఆ నీటిని మళ్ళించినప్పుడే జీవితం చరితార్థ మౌతుంది." - రామకృష్ణ పరమహంస

బహుమతి: టి. ఎస్. చూడామణి, అనంత పురం: మూడవ బహుమతి: పి. హెచ్. సాంబమూర్తి, బొబ్బిలి.

తెలివికి పరీక్ష: 1. శ్రుతి, 2. 27 (పూర్వోత్తర సంఖ్యల లోని అంకెల మొత్తమే బ్రాకెట్ల మధ్య సంఖ్య), 3. దయి తుడు, పెనిమిటి, విభుడు మొ. 4. 6667, 5. మద్యం, 6 రథి, 7 టోకియో, 8. శ్రీపాను గంటి లక్ష్మి నరసింహారావు, 9. సృజన, 10. ఆంధ్రప్రభ - వాకాటి పాండురంగా రావు.

విజేతలు: మొదటి బహుమతి: పి. కనక రాజకుమార్, మురపాక (శ్రీకాకుళం జిల్లా); రెండవ బహుమతి: వి ఎస్. గురు నాథరావు, పార్వతీ పురం (విజయనగరం జిల్లా); మూడవ బహుమతి: జి. కె. శ్రీని వాస్, నరసరావు పేట.

మాటల మహిమ: జవాబులు: 1. ఎండమావి (ఏ), మృగతృష్ణ (డి), 2. బెదరింపు (పి), 3. సూది (పి) పట్టిక (డి), 4. వంటలక్క (బి), జూదంలో వాడే గంటలకడ్డీ (డి), 5. కెరటం(పి). తరంగం (డి), 6. కాలిన పిడక (బి), 7. నర్తకి (డి), 8. రేగిచెట్టు (ఏ), ఒక ఆశ్రమం (డి), 9. గోరింక (బి), 10. మూకుడు (పి), పాలకురాలు (డి).

విజేతలు: మొదటి బహుమతి: కొల్లి పర విజయ్ కుమార్, నులకపేట (గుంటూరు జిల్లా); రెండవ బహుమతి: జె. బాలకృష్ణ, చిన నందిగామ; మూడవ బహుమతి: ఐ. సీతారామదేవి, హైదరాబాద్.

అదృష్ట పాఠకుడు: పసుమర్తి పద్మ నాభన్ బి. కాం. సూళ్ళూరుపేట.

ముఖచిత్ర వ్యాఖ్య: మొదటి బహు మతి వి. సుబ్బలక్ష్మి, ఎలమంచిలి; రెండవ బహుమతి: టి. సావిత్రి, కురుపాం; మూడవ బహుమతి: జి. బాబూరావు, వడిశలేరు (తూ. గో. జిల్లా).

పాఠకుల అభిప్రాయాలు: మొదటి బహుమతి: పసుమర్తి పద్మనాభన్, సూళ్లూరు పేట; రెండవ బహుమతి: యం. అంజారెడ్డి, గాలిపల్లి (కరీంనగర్ జిల్లా).

మీ ప్రశ్నలు: ఉత్తమ ప్రశ్న: జె. మన్మథ్ లక్ష్మణ్, సాలూరు.

మీరైతే? : మొదటి బహుమతి: డి. ఎస్. జాన్సన్, పాలకొల్లు; రెండవ బహుమతి: కె. లక్ష్మణరావు, ఒంగోలు; మూడవ బహుమతి: బి. అనిల్ సుందర్ కుమార్, విశాఖపట్టణం.

భావ పరిచయ పోటీ: మొదటి బహు మతి: జి. ఆర్. దేవేంద్ర బాబు, తిరుపతి; రెండవ బహుమతి: సోమంచి సుబ్బలక్ష్మి, విజయనగరం; మూడవ బహుమతి: పి. శ్రీనివాసరెడ్డి, హైదరాబాద్. ●

## "నిదానంగా మళ్లీ చూడు!"

"మొదటి చూపులోనే ప్రేమలో పడే జబ్బుకి ఏదైనా విరుగుడు చెప్పగలరా?" అని సోక్రటీసును ఆయన శిష్యులు అడుగగా, ఆయన ఇలా అన్నారు: "నిదానంగా రెండో సారి మళ్ళీ చూడు!"

"మననం చేసుకోకుండా చదవటం
జీర్ణశక్తికి మించి భుజించడం వంటిది." —బర్క్

